* ఒక వ్యక్తిని కలుసుకొనడానికి ఏర్పాటు చేసుకున్నట్లయితే ఏ కారణంచేత నైనా అతనిని ఆ సమయానికి కలుసుకొనలేని పక్షమున అతనికి ముందుగా తెలియపరచుట వినయ సూచకం; లేదా అతను నీ కొరకు వేచియుండటం, నిరాశపడటం నీ తప్పు; అతని కాలక్రమ పట్టికకు ఆటంకం.
If you cannot keep an appointment, inform the party concerned in time. Do not let him wait for you. -Lifco Dictionary

* నీ యొక్క ప్రతికార్యం భగవంతుడు చూస్తూనే ఉంటాడు.
Every action of yours is being watched by God.

* జీవన్మృతుడుగా కాదు మృతజీవుడిలా ఉండాలి. Achieve immortality through work.

* పనియే పూజ. Work is worship. Duty is divine.

* కార్యసాధన, కార్యసిద్ధి; సాధనమున పనులు సమకూరు ధరలోన -వేమన

* మాటలతో కాదు చేతలతో నిరూపించు నీ కార్యం.
Prove with deeds rather than with words.

* మాటల కన్నా చేతలు మిన్న. Deeds are more important than words.

## కాలం time

* మనం స్థిరమని భావించే ప్రతి వస్తువునూ కాలం అనేది హరిస్తూవుంటుంది. -శంకరాచార్య

* కాలాన్ని మించిన నియంత లేదు. -గోల్డ్‌స్మిత్(ఆభరణాల ఆచారి, నగలు నగిషీ చేసే ఆయన)

* కాలానికి నిజాన్ని నిరూపించే శక్తి ఉంటుంది.
Time has a way of revealing the truth.

* క్రమేణా కాలం గడచిన కొద్దీ బాధలు ఉపశమనమవుతాయి. బాధ తగ్గుతుందిగాని భౌతిక కాయం బ్యూటీ కోల్పోతుంది. Time is a great healer but a poor beautician. -Graffiti, -Deccan Chronicle

* కాలం కృపగల డాక్టరైనప్పటికీ, రోగికి పరిచర్యవలన సత్వర చికిత్స జరుగుతుంది. Even though time is the best healer, it heals faster when someone cares. Cure lies in care.

* కాలము జరుగుతుంటుంది, కానీ కనబడదు. Time is passing, but not visible.

* కాలమే జీవితం. కాలం వృథా చేస్తే జీవితమే వృథాచేసినట్లు.
Time is life. If time is wasted one's life is wasted.
-Prajapita Brahma Kumaris

## కుటుంబం family

* కుటుంబ సన్నిధి నాపెన్నిధి. In the bosom of my family.

* ఇంట్లో ఈగలమోత బయట పల్లకీల మోత కాదు, ఇంట్లో గూడా పల్లకీల మోతకు ప్రయత్నించు.

* చిన్న / చిన్ని కుటుంబమే చింతలులేని కుటుంబం. -Family planning

* జనాభా విస్ఫోటనం గురించి అందరూ ఆదుర్దాపడాలి.
The population explosion is everybody's baby.-Deccan Chronicle

## కృషి effort

* కృషి మనిషిని ఎప్పటికీ క్రుంగదీయదు. Untiring effort has its own reward.

* మాటల కన్నా చేతలు/చేతులు మిన్న.
Give me the ready hand rather than the ready tongue.-Garibaldi

* Little deeds of kindness, little words of love,
Make our earth an Eden like the heaven above.
-Julia F. Carney, *Little Things*

* కృషి ఫలిస్తే కనుకొలికిల్లో ఆనందబాష్పాలు.
Successful attempt produces tears of joy.

* కృషి ఉంటే దుర్భిక్షం ఉండదు. -ఆర్యోక్తి

## కోపం, క్రోధం anger

* తన కోపమే తన శత్రువు. తన కోపమే తన భంగము. -సుమతీ శతకం

* సున్నితమైన జవాబు క్రోధాన్ని జయిస్తుంది.
A polite reply is the medicine for mad anger.

* క్రోధం మనిషిని పిచ్చివాడిగా చేస్తుంది. మరి మనం విజ్ఞతతో ఎందుకు నడచుకోకూడదు?
Anger makes a man mad, why not be sensible? -Brahma Kumaris

* నీ కోపావేశాన్ని నీవద్దనే ఉండనీ; ఇంకెవరికీ ఉపయోగపడదు.
Keep your temper; no one else wants it. -Deccan Chronicle

* కోపిష్టి జిందాబాద్! He who angers you conquers you. -Elizabeth Kenny

* క్రోధం: దీనికి కారణాలకన్నా దీని పర్యవసానం దుర్భరం.
How much more grievous are the consequences of anger than the causes of it. -Marcus Aurelius

* తనకోపమె తన(కు) శత్రువు. తనకోపమె తన భంగము. People who fly into rages always make a bad landing. -Deccan Chronicle

* కోపము పాపమునకు ధూపము. -బాబా
Anger is an incense which spreads malevolence.

* క్రోధావేశాలలోకి వచ్చినప్పుడు మనం నిగ్రహాన్నే కాదు ఎన్నో శక్తులను నష్టపోతాము/ కోల్పోతాము. When you get angry you lose more than your temper.

* క్రోధం: నీ శత్రువు యొక్క వినాశనం కొరకు రగిల్చిన నిప్పు, అతని కంటే ముందు నిన్నే ఎక్కువ కాలుస్తుంది. Anger : The fire you kindle for your enemy often burns yourself more than him. -Chinese Proverb

## కోరికలు desires

* జీవితంలో ముందడుగు వేయాలనుకుంటే కోరికలు పెరిగిపోకుండా చూసుకోవాలి. If you want to advance in life make sure that your WANTS don't advance.

* కాముడిపై (కోరికలపై) ఉండే మనస్సును రాముడిపై (భగవంతునిపై) తిప్పాలి.
-శాంతి శ్రీ నారద భక్తి దర్శనం

* కోరిక లేని స్థితిని సంపాదించుకోవడానికి చేసే ప్రయత్నమే సన్యాసం. -జిల్లెళ్ళమూడి అమ్మ

* ధర్మము నందును, భక్తియందును, మోక్షమునందు కోరిక లేనిచో మానవుడు తరింపలేడు. కావున ఇవి వదలదగినవి కావు. ఇతర కోరికలన్నీ బంధహేతువులు జాగ్రత్త! -పతంజలి (యోగశాస్త్రం), సూక్తులు-హితోక్తులు-2

## (స)క్రమశిక్షణ discipline

* క్రమశిక్షణ ఆదర్శజీవనానికి ప్రాపు(prop).
Discipline is the backbone of austere living.

* సక్రమశిక్షణ లేని చోట అక్రమశిక్షణ ప్రబలుతుంది.
Where/when discipline is lacking, indiscipline ushers in/prevails.

* మానవునిలో దాగియున్న ఉత్తమ గుణముల వికాసము కొరకు, దుర్గుణముల నిర్మూలన కొరకు ఉత్తమ సాధనము ఒక (స)క్రమశిక్షణమే. -స్వామి వివేకానంద

* కట్టు బట్టలు ఎంత అవసరమో, కట్టుబాటు అంత అవసరం. -యం.కె.-సూక్తులు,హితోక్తులు-2

* అన్ని తరగతుల/అంతస్తుల వారు విజయంపొందినా లేకున్నా వారి విధి వారు నిర్వర్తిస్తే మనశ్శాంతి లభిస్తుంది. Let men of all ranks, whether they are successful or unsuccessful, whether they triumph or not- let them do their duty, and rest satisfied. -Plato

* లేవండి! మేల్కొండి! గమ్యం చేరేవరకు ఆగకండి. -స్వామి వివేకానంద
Arise! awake! and stop not till the goal is reached.-Swami Vivekananda

## క్షమించడం forgiveness

* తల్లి/దైవం పుత్రుని క్షమించడం ముదావహం. అతను చేసిన తప్పును సరిదిద్ది మరచిపోవాలి (మరపు లేకపోతే మనుగడలో మురిపము లేదు).

God pardons like a mother, who kisses the offense into everlasting forgetfulness (which is Nature's safety valve).
-Henry Ward Beecher

* పొరపాటు క్షమించడం మంచిదే; మరచిపోవడం ఉత్తమం.
Good, to forgive; Best, to forget. -Browning, *La Saisiaz*

* వహించు, సహించు. Bear and forbear. -Epictetus

* ఇతరులను క్షమించు, కాని నిన్ను మాత్రం కాదు.
Forgive others often, yourself never. -Syrus

* శత్రువును క్షమించడం అతన్ని జయించడమే. - HazratAli.-భావన

## గణతంత్ర దినం Republic Day

## రాజ్యాంగం Constitution

# THE REPUBLIC OF INDIA

26th January 1950

WE, THE PEOPLE OF INDIA, having solemnly resolved to constitute Indi :nto a SOVEREIGN DEMOCRATIC REPUBLIC and to secure to all its citizens :

JUSTICE, social, economic and political;

LIBERTY of thought, expression, belief, faith, and worship;

EQUALITY of status and of opportunity; and to promote among them all

FRATERNITY assuring the dignity of the individual and the unity of the Nation:

IN OUR CONSTITUENT ASSEMBLY DO HEREBY ADOPT, ENACT AND GIVE TO OURSELVES THIS CONSTITUTION.

## గర్వం pride

* నమ్రత ఉన్నవాళ్ళు నిగర్వులు; వారు తమకు గర్వం లేనందుకు గర్విస్తున్నారు.
They are proud in humility, proud in that they are not proud.
- Burton, *Anatomy of Melancholy*

* గర్వం దేవదూతల్ని నాశనం చేసింది.
Pride ruined the angels. –Emerson, *The Sphinx*

* గర్వం బలహీనం విడదీయరాని కవలలు.
Pride and weakness are Siamese twins. –Lowell

* ముసలితనం రూపాన్ని, ఆశ ధైర్యాన్ని, మృత్యువు ప్రాణాన్ని, అసూయ ధర్మాచరణాన్ని, క్రోధం సంపదను, కామం సిగ్గును, గర్వం సమస్తాన్ని హరిస్తుంది. –విదురనీతి, –భావన

## గుణాలు, స్వభావం qualities & nature

* గొప్ప వ్యక్తులు ఆశయాలకై జీవిస్తే, దుర్బలులు ఆశల కొరకు జీవిస్తారు. -చైనా సామెత, -భావన

* సజ్జన దుర్జనులు జగమందు కలిసే జన్మిస్తారు; కాని తామరపువ్వుకీ జలగకీ తారతమ్యం ఉన్నట్లు గుణాలు మాత్రం వేరుగా వుంటాయి. -తులసీదాసు, -భావన

* తనను నరికేవరకూ చెట్టు మానవునకు నీడనూ, ఫలాల్నీ ఇస్తూనే వుంటుంది. గొప్పవారు తాము మరణించేవరకూ దుర్జనుల క్కూడా మేలు చేస్తూనే వుంటారు.
-అవ్వైయార్, -భావన

* ఉత్తముడు మాటల్లో మూగిగానూ, చేతల్లో చురుకుగానూ వుంటాడు. -Confucius -భావన

## గ్రంథాలయం library

* నిశ్శబ్దక్రియాయోగి గ్రంథాలయం -మాడుగుల. గ్రంథాలయం మౌన విద్యాలయం-సి.నా.రె.

## జయం, విజయం success

* పట్టుదల ఉంటే జయం తప్పదు.
Victory belongs to the most persevering. - Napoleon

* నీటి ధార రాయిని గూడా తొలిచి వేస్తుంది.
The waters wear the stones. --Job XIV.19

* ఏ పనైనా సరే హీనం కాదు. No work is petty. -Swami Vivekananda

* శ్రద్ధ, సహనం, ఉడుముపట్టు కార్యనిర్వహణకు మరియు జయానికి సోపానములు.
Purity, patience, and perseverance are the three essentials to success. -Swami Vivekananda

## జీవితం life

* నరాలకి బలం చేకూర్చుకొనండి. మనకు కావలసిందేమంటే ఇనుము లాంటి పేశీలు మరియు ఉక్కులాంటి నరాలు. Make your nerves strong. What we want is muscles of iron and nerves of steel. -Swami Vivekananda

* నీ ఆత్మ కన్నా మిన్నయైన గురువు మరి యొకరు లేరు. -స్వామి వివేకానంద
There is no other teacher but your own soul. -Swami Vivekananda

* వృద్ధిచెందుట జీవిత లక్షణం, ముడుచుకొని కట్టెబారి పోవుట మృతి. -స్వామి వివేకానంద
Expansion is life, contraction is death. -Swami Vivekananda

* జీవితజయం యొక్క రహస్యం: కార్యసాధనలో తుది సాఫల్యానికి ఎంత ప్రాముఖ్యతనిస్తామో అలాగే ఆ కృషిలోని ఘట్టములకు అంత ప్రాముఖ్యత నివ్వాలి.
Secret of success: to pay as much attention to the means as to the end. -SwamiVivekananda

* కండబలం, దయ ప్రజల నడవడిని, ప్రవర్తనను రూపు దిద్దుతాయి. Might and mercy guide the conduct of human beings. -Swami Vivekananda

* ఆడంబరమయమైన జీవితమా లేక ఆదర్శప్రాయమైన/ ఆదర్శవిలువలతో కూడుకొన్న జీవితమా? ఏది ముఖ్యం? What is more important- your standard of living or living a life with correct standards? -Brahma Kumaris

* నీ జీవితం కాలచక్రం అంచున, తామరాకు మీద నీటి బొట్టువలె నాట్యమాడనీ.

* కాలమే జీవితం. కాలాన్ని వృధాచేయడం అంటే జీవితాన్ని వృధా చేసుకోవటమే.
Time is life. Wasting time is wasting one's life. -Brahma Kumaris

* చాలా మందికి జీవితం అంటే రోజులు గడవటమే.
Too many people live their lives by the calendar. -John Glenn

* భగవంతుడు ఈ జీవితం అనే గడియారానికి కీ ఇచ్చి మనల్ని లోకంలో వదిలాడు, మధ్య మధ్య 'అలారం' కీ (శరీర అస్వస్థత) గూడా ఇస్తూ ఉంటాడు. గడియారం కీ ఆగిపోయేవరకూ/అయిపోయేవరకూ జీవిస్తాం.
God has given key to this watch, viz. life, punctuated by spells of alarm, viz. ill health. We live till the key lasts.

* వయసు ముదురుతున్న కొద్దీ ఆలోచనలు పెరగాలి. Think in a big way to grow big.

* జీవితం ఒక నాటకం వంటిది కానీ అందులోని రహస్యాన్ని అర్థం చేసుకుంటే ఎంతో సంతోషంగా ఉంటుంది. Life is like a drama. If one understandands the plot, there is great happiness.

* జీవితం అంటే ఏమిటి? ఆశలను రేకెత్తించడం, ఉల్లాసం ఉన్నప్పుడు నవ్వులు, విషాదం కలిగినప్పుడు ఏడుపులు.
What is life ? Triggers of hope, smiles of joy, cries of loss.

* Everybody wants to be somebody; nobody wants to grow. -Goethe

* I hate to love you because you hate to love me or love to hate me.

* Life is a continued balancing act between your efforts and destiny.

* జీవితం : పుట్టుట మరియు గిట్టుట మధ్య నున్న అనివార్యమైన వ్యవధి లోని ఖుషీ.
There is no cure for birth and death save to enjoy the interval.
-George Santayana

* జీవితమంటేనే బంధం. పుట్టేటప్పుడే మాతాశిశుబంధం(బొడ్డుతాడు) తో పుడ్తారు.
Life is full of complications. Even when you are born, there is a string attached(umblical cord). -Jacqui Bronts

* నదీ ప్రవాహంలో రెండు కట్టెలు కొంతదూరం కలిసి ప్రయాణం చేస్తూ విడిపోతాయి. ఈ జన్మలో అనుబంధాలు అలాంటివే ! సంయోగవియోగాలకు బాధపడవలసిన పని లేదు. -ఋగ్వేదం -సూక్తులు-హితోక్తులు-2

* మార్పు కోరుకుంటే జీవితసమరంలో సబబు మార్పు ఎన్నుకో.
If you want to truly change, choose the change for the better.

* 'మా' మరియు 'మీ' మధ్య ఉన్న భేదాల్ని సమసిపోనివ్వండి.
Strive to fill the abyss between 'myself' and 'yourself'.

* గులాబి పువ్వు ముళ్ల మధ్యన ఉంటూ గూడా ఆ ముళ్ళ చేత ఎప్పుడూ గాయపడదు, మరి మనం?
A rose can live amongst the thorns and yet never get injured by them; how about you/us ?

* రసజ్ఞ నోట్లో పళ్ల మధ్య వాటిచే కొరకబడకుండా తిరుగాడుతూనే ఉంటుంది; అదే విధంగా సమాజ సభ్యులలో మనమెందుకు మెలగకూడదు?
The tongue will manipulate to turn insde the teeth without getting injured by them. Why not a human being adjust the same way in the members of a society ?

* జీవితం విలువ అమూల్యం. Life is precious. -Swami Sivananda

* ధర్త్రి మీద తనువుల్లో కల్లా మనిషికాయమే అతివిలువైనది.
Human life is more precious than any other life on the earth.

* గెలిస్తే గంభీరంగా ఉండు, ఓడితే మితభాషిగా ఉండు.
When you win, say nothing. When you lose, say less. -Paul Brown

* విభిన్న రుచులు జీవిత రంజు. లోకో భిన్నరుచిః. Variety is the spice of life.

* మనిషి ఆరాటపడాల్సింది దీర్ఘజీవితానికే గాదు, దివ్యజీవనానికి గూడా.
Man should not only aspire for a long life but a sacred life, too.

* జీవితం అంటే వివిధ ఘట్టముల వరుస/జాబితా. Life is a series of incidents.

* బీజం అంతరించి మొక్క అవుతుంది. మనిషి బ్రతుకు కూడా ఇంతే, అనగా పునర్జన్మ(పొందుతాడు). The seed dies, transforms into a new life and so does man. – modified from George Macdonald

* ప్రస్తుత జీవితం భ్రూణం యొక్క ముగింపు. ఈ జీవితం తర్వాత మరి ఏ రకమైన జీవిలోనికి మారుతామో! Birth into this life was the culmination of the foetus, and the death of this life will be the birth into some new mode of living. -modified saying of Rev.Dr. Hedge

* పరోపకారార్థం ఇదం శరీరం. This life is for service to others.
If I had to define life in a word, it would be: Life is creation. -Claude Bernard

* జీవితం వెల అమూల్యం. దీర్ఘాయువు కలిగి సుఖసంతోషాలతో జీవించాలి.
Life is precious. It has to be lived fully and happily too.

చాతుర్య నిర్వచనములు deft definitions

* 1. జీవితం ఒక సాహసం - సాహసించు. Life is an adventure - dare it.

* 2. జీవితం మిథ్య/ గూఢం - దాని అంతు కనుక్కో. Life is a mystery - unfold it.

* 3. జీవిత చదరంగంలో నీవు ఒక పావు(భటుడు, ఏనుగు,గుర్రం, వగైరా). ఆ పావును జరుపు. Life is a game - play it.

* 4. జీవితం ప్రపంచంలో ఒక అవకాశ వెలుగు - ఆ ఆశాకిరణాన్ని పట్టుకో అనుభవించు. Life is an opportunity - Grab it.

* 5. జీవితం ఒక ప్రయాణం - శుభయాత్ర. Life is a journey - Happy journey

* 6. జీవితం అంటే గానమాధుర్యం - పాటపాడి చూడు. Life is a song - sing it

* 7. జీవితమంటే ప్రేమయే - ప్రేమలో/ప్రేమతో జీవించు.
Life is love - Live in love.

* 8. జీవితం ఒక ప్రతిజ్ఞ/ఇచ్చినమాట - ప్రతిజ్ఞ నెరవేర్చు. ఇచ్చిన మాటకు కట్టుబడివుండు. Life is a promise - fulfil it.

* 9. జీవితం కర్తవ్యం/విధి. దానిని నిర్వర్తించు. Life is a duty - perform it.

* 10. జీవితానికి హంగు అందం. ఆ అందాన్ని మెచ్చుకో.
Life is a beauty - appreciate it.

* 11. జీవితం ఒక పోరాటం - పోరాటంలో గెలుపొందు.
Life is a struggle - come victorious.

* 12. జీవితం సంభ్రమము/చిక్కు. చిక్కును విడదీసి చక్కగా చేయి, దానికి ఉపాయం కనిపెట్టు. జీవితంలో జయం నీ ధ్యేయం.
Life is a puzzle - solve it. The goal in life is success.

* 13. జీవితం ఒక సవాలు - ఎదుర్కో. Life is a challenge - meet it.

* 14. జీవితం: బేరగాళ్ళకు బేరం లాంటిది - మధ్యతీరులో నడుచుకో.
Life is a bargain - go via media.

* 15. జీవితం వివిధార్థ విశారదం. Life is a pun.

* 16. జీవితం ఒక శ్లేష. Life is a quibble.

* 17. జీవితం ఒక క్విజ్ - జీవితం అనే క్విజ్ పోటీలో నెగ్గాలి.
Life is a Quiz; win in the quiz.

* 18. జీవితం కొందరికి దుర్భరమవచ్చు కాని ధైర్యం విడనాడకు, జీవయాత్ర సాగించు.
Life may be a tragedy - face it.

* 19. జీవితం అంటె విషాదం-విషాదాన్ని దిగమ్రింగుకో.
Life is a sorrow - overcome it.

* 4. జీవితం ప్రపంచంలో ఒక అవకాశ వెలుగు - ఆ ఆశాకిరణాన్ని పట్టుకో/ అనుభవించు. Life is an opportunity - Grab it.

* 5. జీవితం ఒక ప్రయాణం - శుభయాత్ర. Life is a journey - Happy journey!

* 6. జీవితం అంటే గానమాధుర్యం - పాటపాడి చూడు. Life is a song - sing it.

* 7. జీవితమంటే ప్రేమయే - ప్రేమలో/ప్రేమతో జీవించు.
Life is love - Live in love.

* 8. జీవితం ఒక ప్రతిజ్ఞ/ఇచ్చినమాట - ప్రతిజ్ఞ నెరవేర్చు. ఇచ్చిన మాటకు కట్టుబడివుండు. Life is a promise - fulfil it.

* 9. జీవితం కర్తవ్యం/విధి. దానిని నిర్వర్తించు. Life is a duty - perform it.

* 10. జీవితానికి హంగు అందం. ఆ అందాన్ని మెచ్చుకో.
Life is a beauty - appreciate it.

* 11. జీవితం ఒక పోరాటం - పోరాటంలో గెలుపొందు.
Life is a struggle - come victorious.

* 12. జీవితం సంభ్రమము/చిక్కు. చిక్కును విడదీసి చక్కగా చేయి, దానికి ఉపాయం కనిపెట్టు. జీవితంలో జయం నీ ధ్యేయం.
Life is a puzzle - solve it. The goal in life is success.

* 13. జీవితం ఒక సవాలు - ఎదుర్కో. Life is a challenge - meet it.

* 14. జీవితం: బేరగాళ్ళకు బేరం లాంటిది - మధ్యేతీరులో నడుచుకో.
Life is a bargain - go via media.

* 15. జీవితం వివిధార్థ విశారదం. Life is a pun.

* 16. జీవితం ఒక శ్లేష. Life is a quibble.

* 17. జీవితం ఒక క్విజ్ - జీవితం అనే క్విజ్ పోటీలో నెగ్గాలి.
Life is a Quiz; win in the quiz.

* 18. జీవితం కొందరికి దుర్భరమవచ్చు కాని ధైర్యం విడనాడకు, జీవయాత్ర సాగించు.
Life may be a tragedy - face it.

* 19. జీవితం అంటె విషాదం-విషాదాన్ని దిగమ్రింగుకో.
Life is a sorrow - overcome it.

* 20. జీవితం ఒక కళ - దాన్ని పోషించు. Life is an art - promote it.

* 21. జీవితం దీర్ఘం - దాన్ని కురచ చేయవద్దు. Life is long - don't make it short. 1-21, -modified from *"The Mirror of Human Life"*

* వీలు కానిది అంటూ లేదని ధైర్యం తెచ్చుకో.
Delete "impossible", in your dictionary. Interpret it as 'I'm possible,

* సెక్సు మనుగడకు మూలం. Sex lies at the root of life. -Havelock Ellis

* నీకు కావలసిన వాడిని ప్రేమించు, ద్వేషించు; కాని 'నా వాడు' అని మాత్రం మరవవద్దు.
Love him, hate him; but don't disown him.

## జోకులు Jokes

* జోకు: అమాయకపు ఆనందప్రదాత Joke: innocent merriment / mirth

* హార్దిక హృదయ స్పందన ఒక దివ్యౌషధం (లా పనిచేస్తుంది).
A merry heart is a good medicine.

* Girl friend to a boy friend: "You must try to be more affectionate."

  Boy friend: "So I made two more girl friends."

* Worry(దిగులు) : When one's wife is pregnant ;
tension(ఒత్తిడి) : when one's girl-friend is pregnant.

* Don't allow mom to brush your hair when she is cross with dad.

* Lullaby for a baby: Whether she sleeps at the melody or wants to pay deaf ear to it.

* Doc to patient: Wherefrom did you get that advice?
Patient: From the pharmacist
Doc: What idiotic advice did he give you?
Patient: To consult you (doctor).

* Master stroke
Loud buzzing annoying noise from an airvent distracting a lecturer
Lecturer: "Is that noise annoying you as much as me?"
"Oh, no," replied a student from the back benches,
"You' re not that bad." - Reader's Digest

## టెర్రరిసమ్ terrorism

* మనుష్యుల్లో ఒకరికొకరికి అమానుషత్వం వలన అసంఖ్యాకులు శోకదగ్ధులగుచున్నారు. "Man's inhumanity to man makes countless thousands mourn!" -Robert Burns

* విమానాశ్రయాల్లో భద్రతారక్షణ వ్యవస్థను కట్టుదిట్టం చేశారు. Security beefed up at airports.

## ట్రాఫిక్ నిబంధనలు traffic rules

* ఎరుపు సిగ్నల్ ఉంటే 'ఆగు' అని అర్థం. Don't jump red signal.

* వామ భాగం మీది. Keep to left.

* రెండు రోడ్ల జంక్షన్ వద్ద : ఎడమవైపు దారిని అరికట్టవద్దు; ఎడమవైపు వెళ్ళేవారిని వెళ్ళనీయండి. At cross road junctions: Don't block the left; keep the left open.

* మీ కుడివైపు వేగంగా పోతున్న ట్రాఫిక్‌ను పోనీయండి. Give way to the traffic on your right side, viz, those who overtake you.

* వేగంగా పోయే వాహనాలకు దారి ఇవ్వండి. Give way to faster vehicles.




* Tజంక్షన్ వద్ద కుడివైపు తిరగాలంటే Tలో సెంటర్ పాయింట్( ● ) కు ఎడమవైపు నుండి తిరగాలి. కుడివైపు తిరగడం తప్పు, ఎందుచేతనంటే అటు వచ్చేవారికి అది ఎడమవైపు. At T junction, if you want to turn to the right, proceed left to the centre point( ● ); going right to the centre point is wrong since it is the right of way for the traffic coming from the opposite direction.

* రోడ్డు మధ్యన గీసిన పసుపుపచ్చ రంగు గీత దాటవద్దు. Don't cross the yellow line drawn on the middle of the road.

* కాలినడక పోయేవారి మీద కరుణ / కనికరం చూపండి.
Be pedestrian friendly.

* "ప్రవేశ నిషేధం" చోటకు పోవద్దు. Don't enter 'No Entry' area.

* ట్రాఫిక్ నిబంధనలను పాటించండి. మీరు సురక్షితంగా ఉండండి. ఇతరులను సురక్షితంగా ఉండనివ్వండి. Follow traffic rules - Be safe and let others be safe.

* రోడ్డు ప్రజలది. ట్రాఫిక్ నిబంధనలు పాటించండి.
Don't rule the road. Follow rule of the road.

* ముందువాళ్ళను చూడటమేగాదు వెనుకనుంచి వస్తున్న ట్రాఫిక్‌ను గూడ గమనిస్తూ ఉండాలి.
Be careful / mindful of the traffic coming from your back.

* వేగం ఝళిపిస్తుంది! జళిపిస్తుంది సరే కాని ప్రాణం తీస్తుంది.
Speed thrills but kills.

* వేగం కన్నా భద్రం ముఖ్యం. భద్రత మన బాధ్యతే.

* Graffiti in Traffic
In India, in traffic rules: "keep to the left; then you are right"

* *"Stop says the red light, Go says the green*
*Change says the amber one, blinking in between*
*That is what they say That is what they mean*
*All must obey them, even the queen."*
Thus runs the nursery rhyme.

## డబ్బు money

* డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు.
A man without a penny is worth for nothing.

* డబ్బు పెక్కు సౌకర్యాలనిస్తుంది. Money makes many things.

* 1. పైసలే పురుషలక్షణం 2. డబ్బుగలవాడే ధన్యుడు.
Money makes the man. - Aristodemus

* 1. రూపాయిలు పోతుంటే నయాపైసలకు ఆశపడ్డట్లు

* 2. దూలాలు కొట్టుకుపోతుంటే గడ్డిపోచలకు ఆశపడ్డట్లు.
Penny wise, pound foolish. - Burton

* రూక/డబ్బు పాపిష్టిది, దొంగప్రజలను తయారుచేస్తుంది.
Money can make counterfeit men.

* ధనం చెట్టుకొమ్మల మీద దొరికేటట్లయితే .... బేరాలే ఉండవు.
If money grew on trees... one need not bargain.

* డబ్బులేని బ్రతుకు మబ్బుపట్టిన రాత్రి; డబ్బుతోన వచ్చు నిబ్బరమ్ము;
డబ్బులేనివాడు డుబ్బుకు కొఱగాడు. -నార్ల వెంకటేశ్వరరావు

## తప్పు mistake

'mis' - prefix meaning wrong

* తప్పులెన్నువారు తమతప్పు లెరుగరయా విశ్వదాభిరామ వినురవేమ.

* అవగాహన/ఇష్టం సన్నగిలితే అపరాధాలు గోరంతలు కొండంతలవుతాయి.
Faults are thick when understanding/ love is thin.

* సత్యాన్వేషణ మార్గంలో తప్పుకూడా ఒక మజిలీయే. - రాధాకృష్ణన్, -సూక్తులు-హితోక్తులు -2

* పొరపాట్లకు (ఉప) శమనౌషధం : మరపే
The remedy for wrongs is to forget them. - Syrus

## దాంపత్యం family life

* రోగం రట్టు కాపురం గుట్టు అన్నారు.
Reveal disease but hide family quarrel/secret.

* దాంపత్య జీవనం జోడెద్ల బండి. Married life is a ride on a 'double bullock' cart.

* దాంపత్యసుఖం: సాలెగూడులో నిర్బంధం. Family ties: spider web

* జీవితం అనే రేడియో సెట్టుకి భర్త ఏరియల్ భార్య ఎర్తు. - ఆరుద్ర

## దుఃఖం grief

* దుఃఖానుభవమే ఒక విధమైన ఔషధం. Grief, in itself, is a medicine.

## దూషణ abuse

* పోషించేవారు దూషిస్తే ఫరవాలేదు.
* వెధవ: వె=వెయ్యేళ్ళు, ధ=ధనముతో, వ=వర్ధిల్లు
* భూషణమిస్తే దూషణ మరచిపోతారు. Abuse is annulled by a present.
* తిట్లు తినేవారికి, పాట్లు పడేవారికి సహనమే దిక్కు.
* దూషణ పైకి విసిరిన రాయి వంటిది. అది విసిరిన వారి నెత్తిమీదనే పడుతుంది.
  - quoted in సూక్తులు - హితోక్తులు -2

## దేశం, దేశభక్తి patriotism

* Patriotism: Swim or sink, live or die, survive or perish for the cause of your country.
* దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్ - గురజాడ అప్పారావు
* ఏ దేశమేగినా ఎందుకాలిడినా ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
  పొగడరా నీతల్లి భూమి భారతిని నిలుపరా నీ జాతి నిండుగౌరవమును. – రాయప్రోలు సుబ్బారావు
* సమస్త లోకాః సుఖినోభవన్తు: సర్వేజనాః సుఖినోభవన్తు;
  సర్వేమిత్ర బాంధవాః సుఖినోభవన్తు
  The world is my country, all mankind are my brethren, and to do good is my religion. - Thomas Paine, *Rights of Man*

## ద్వేషం hatred

* Definition of hatred: hate and get red
* ఇటు చూస్తే నుయ్యి, అటు చూస్తే గొయ్యి

  Between the Devil and deep (blue) Sea.
* దయ్యాన్ని మాత్రమే ద్వేషించు. Hate only the devil.
* ద్వేషభావాల నుండి సురక్షితంగా ఉండేందుకు ఎదుటివారికి గౌరవం ఇవ్వడం ఒక మార్గం.
  One way to guard against the feelings of hate /hatred is to give regards to them. --Brahma Kumaris

## దైవం god

* భగవంతుడు సద్గుణ సాగరుడు. నీవు ఏదైనా అవగుణంతో దహించుకుపోతుంటే, ఒకసారి ఆ సాగరంలో/ 'కుంభమేలా' లో మునిగి చూడండి; పునీతుడవు 'అవుతావు! God is the Ocean of Virtues. If you are burning with any vice, take a holy dip in that Ocean / Kumbh Mela.

* ఉచ్ఛ్రాయ యోచన: "నాజీవితం నాది కాదు, ఆ పరమాత్మ సొత్తు" అనే భక్తి పంథ For one's spirit to remain strong:

  "My life doesn't belong to me, but to the Almighty" attitude

* పరమాత్మ నామోచ్చారణ జీవితంలోని ఒడుదుడుకులను ఊరడిస్తుంది. Recitation of Lord Almighty's name softens gently every knock of/in life.

* దైవాన్ని స్మరించు. Seek solace in God.

* మనం ఎవర్ని ప్రేమిస్తే వారిలా ఉండాలని ప్రయత్నిస్తాం, మరి దేవుణ్ణి ప్రేమిస్తే దేవునిలా ఉండేందుకు ప్రయత్నించాలి కదా? If we love someone we try to be like that person. If we love God should we not attempt to be Godly ? - Brahma kumaris

* ప్రతి దేశం భగవంతుని భవనంలో ఒక గది మాత్రమే. Each country is an annexe in God's mansion.

* దేవాలయాలు శిథిలమై పోవచ్చు కాని వాటిలోని దేవుడు చిరంజీవి. Temples may perish but God inside lives ever.

* గురువును సేవిస్తే భగవంతుడిని సేవించినట్లే. -శివానంద స్వామి

* పంచదారలో తియ్యదనమున్నట్లు ప్రతిప్రాణిలో భగవంతుడున్నాడు. - స్వామి సుందర చైతన్యానంద

* పూవులోని పరిమళం లాగా, అద్దంలోని ప్రతిబింబంలాగా దైవం నీలోనే ఉన్నాడు. God is within you, just like the fragrance in a flower, image in a mirror.

* దేవుణ్ణి ప్రేమించడం జీవితలక్ష్యం, దేవునిలో ఐక్యం కావటం జీవిత గమ్యం. -మెహర్ బాబా

* తల్లితండ్రులే ధర్తి మీద దేవుళ్ళు Parents are Gods on earth.

* మనం దైవాన్ని స్మరించినప్పుడు మన ఖాతాలో సుఖశాంతులు జమ అవుతాయి, మరిచిపోతే అవి ఖర్చయి పోతాయి.
Peace and happiness are credited into your account when God is remembered, but debited when He is forgotten.

భగవదంశ

* మృదువుగా, తీయగా మాట్లాడు. మహాత్ముల సత్సాంగత్యంలో ఉండు/జీవించు. మితంగా భోజనం చేయి. నీ ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకో. సర్వమానవ సౌభ్రాతృత్వం అలవాటు చేసుకుని, తోటి మానవుని 'అన్నా' అని సంబోధించి సత్పురుషుడవగు. జాగరూకత అలవరచుకో. పరాకు, ఏమరుపాటు వద్దు. మితభాషివి కమ్ము.

Live in God

Speak kind and sweet words. Have *satsang* of Mahatmas. Eat moderately. Take care of your health. Cultivate fellow feeling and universal brotherhood.... Be on the alert. Speak little.
- Sri Swami Sivananda

* అగ్ని దగ్గరున్నవారి చలి పోగొడుతుంది, దూరస్థుల చలి పోగొట్టలేదు. అలాగే భగవంతుడు అందరియందు సమభావంతో ఉన్నా శరణన్న వారి భవబంధాలు పోగొడతాడు.
-నీలకంఠ దీక్షితులు

* ఈ కనిపించేదంతా భగవంతునికి చెందినదే! -ఉపనిషత్

* జీవితం భగవంతుడు ఇచ్చిన వరం - దానికి వెలకట్టలేం.
Life is a gift (from God) - treasure it.

* భగవన్నామోచ్చారణ ఆయన మీద నమ్మకానికి / గురికి రుజువు.
Even the merest gesture is holy if it is filled with faith.
- Franz Kafka

* నిశ్చలంగా ఉండు. నేను దేవుడినని గ్రహించు. -బైబిలు, -సూక్తులు-హితోక్తులు-2

* మహావాక్యం : అహం బ్రహ్మాస్మి.

* పరమాత్మ ఒక్కడే! ఋషుల చేత వివిధ నామాలతో పిలువబడుతుంటాడు. -శ్రుతి వాక్యం
ఏకం సత్ విప్రా బహుధా వదన్తి

* My concept about God : దైవం/భగవంతుడు నీయొక్క ప్రతిచర్యనూ గమనిస్తున్నాడు/పరిశీలిస్తున్నాడు.
God is watching every action of yours.

## ధనం wealth

* ధనమే దేశాన్ని, సంఘాన్ని, ఆఖరికి కుటుంబాన్ని నడిపే ఇంధనం.
-Swift. -సూక్తులు-హితోక్తులు-2
Almighty Dollar

* ధనం జీవన ఎరువు లాంటిది. ఎరువును దిగజల్లితే పంటకు దోహదమవుతుంది. శరీరంలో రక్తం ఎట్లా గయితే ప్రసరణ అవుతుందో అట్లాగే ధనం సద్వినియోగంలో ఉండాలి, ఒకచోట మూలగగూడదు. "Money is life manure. If it is spread around, it does lot of good. Money, like blood, should be in circulation and not to be accumulated." -Charles Lamb

* ధనం ఎరువులాంటిది. దాన్ని వెదజల్లకపోతే కంపుకొడుతుంది.
Money is like manure. You have to spread it around or it smells. - J Paul Getty

* ధర్మబద్ధం కాని అర్థం అనర్థ హేతువు. -సుభాషితం, -సూక్తులు-హితోక్తులు-2

* ధనవంతుని గీటురాయి ఏమిటంటె తనకు ఎంత ఉన్నది అనికాదు తను ఎంత ఇతరులకు ఇచ్చాడు అన్న సత్యం. Wealth is measured not by how much we have but by how much we give.

* మనుగడలోనే మరియొకరికి దానం మిన్న. To give while living is far superior than to leave everything behind.

* ధనము సంపాదించుట దైవయోగము కాదు. సంపాదించినది సద్వినియోగము చేయుట భగవదనుగ్రహము. -అవధూత స్వామి

* భోగం ఉండి భువిని వదిలిపోతే అది చెప్పుకోతగ్గ విషయం కాదు.
'Any body who dies rich dies disgraced'. - John D. Rockfeller

* విత్తం వినాశానికి విత్తనం ...కాని విషాదమాపకం ఒకప్పుడు. Money, the root of all evil... but the cure for all sadness. - Mike Gill

* Money is the most egalitarian force in society. It confers power on whoever holds it. -Roger Starr

* ధనం ఆశను రగిలిస్తుంది. కాని ఎక్కువ కాలం ఉండకపోవచ్చు.
Money may kindle, but it cannot by itself, and for very long, burn. - Igor Stravinski

* 1. భోగాలు తక్కువ ఉన్నవాడే నిజమైన ధనవంతుడు

* 2. భోగలాలసుడి ధనం బూడిదలో పోసిన పన్నీరే.
That man is the richest whose pleasures are the cheapest. - Thoreau

* ఈ జగత్తుకు ధనమే మూలం. -భర్తృహరి. ధనమూల మిదమ్ జగత్

## ధర్మం *dharma*

* ధర్మో రక్షతి రక్షితః - ధర్మాన్ని నీవు రక్షిస్తే, ధర్మం నిన్ను రక్షిస్తుంది.

* ధర్మము అనగానేమి? శబ్ద రత్నాకరము: 1. పుణ్యము 2. న్యాయము 3. సామ్యము = సమత్వము 4. స్వభావం (personality మూర్తిమత్వం) 5. ఆచారము, మడి = cleanliness శౌచము 6. అహింస 7. వేదోక్తవిధి-మనుస్మృతి 8. ఉపనిషత్తు 9. యజ్ఞము

* Sankaranarayana Dictionary : ధర్మము :
1.duty 2. prescribed code of conduct 3. law, statute 4. ordinance 5. rule 6. precept 7. practice, custom 8. justice, equity, right; virtue, morality, rectitude, righteousness 9. moral and religious merit 10. good work, character 11. colloq. alms-giving

* ధైర్యము, ఓర్పు, మనోనిగ్రహము, తనది కాని వస్తువునందు ఆశలేకుండుట, శుచిత్వము, ఇంద్రియనిగ్రహము, బుద్ధిమత్వము, విద్య, సత్యభాషణము, కోపరాహిత్యము-ఈ పదిన్నీ ధర్మమునకు లక్షణములు. -మనుస్మృతి

ధర్మానుష్ఠాన చంద్రిక - పరిమి రామకృష్ణ శాస్త్రి

* 1. పురుషులు మాత్రమే భూమి మీద ఆని సాష్టాంగ నమస్కారము చేయవలెను.

* 2. స్త్రీలు వక్షస్థలం నేలమీద ఆన్చిన స్త్రీత్వం నశిస్తుంది. కనుక మోకాళ్ళు నేలపై ఆన్చి, తమ యెడమ పాదము మీద కుడిపాదము ఆన్చి సాష్టాంగ నమస్కారము చేయాలి.

* 3. ఇద్దరు కూడిన భుక్తి, ముగ్గురు కూడిన భోజ్యము. నలుగురు కూడిన భోజనము.

* 4. భార్య చేసిన పాపంలో భర్తకు భాగముండదు. కాని భర్త చేసిన పుణ్యంలో భార్యకు సగం భాగం ఉంటుంది; పాపంలో ఉండదు.

* 5. 16 సంవత్సరములు వచ్చిన తర్వాత కుమారుని మిత్రునిగా చూడవలెను.

* 6. పతివ్రత : భర్తనే వ్రతంగా భావించే ఆమె.

* 7. అశ్లీలము, అమంగళము అగు మాటలు ఎప్పుడూ అనకూడదు.

* 8. మౌనము వలన ఆయుర్దాయము పెరుగును.

* 9. గృహప్రవేశము రాత్రిపూట చేయవలెను. పగలు చేయరాదు.

* 10. పెండ్లిలో తుమ్ము వచ్చిన శుభప్రదము.

* 11. ఆశకు ఆవలి వద్దు తృప్తి.

* 12. దేహాభిమానము వుండరాదు. ఆత్మాభిమానము ఉండాలి.

* 13. విష్ణువు అలంకార ప్రియుడు, సూర్యుడు నమస్కార ప్రియుడు.

* 14. తీర్థం శివస్వరూపం; ప్రసాదం విష్ణుస్వరూపం.

* 15. ఘంటానాదం దేవతలకు పిలుపు.

* 16. ఒక దీపం కుందిలో రెండు జ్యోతులు(దీపములు)కు తక్కువ కాకుండా వుంచవలెను. ఒక్క దీపం అశుభం.

* 17. నమస్కారం చేయునపుడు 'నమస్తే' అని అనరాదు. పెద్దలకు 'నమోనమః', సామాన్యులకు 'నమోవః' అనాలి.

* 18. కొద్ది స్నేహాన్ని నడిపేవాడు స్నేహితుడు. చిరకాల స్నేహం చేసేవాడు మిత్రుడు.

* 19. దానము పాత్రత నెరిగి యిచ్చుట మంచిది.

* 20. అతి దానము వలన పాడైన వాడు బలిచక్రవర్తి. అతి కామము వలన పాడైన వాడు రావణుడు. అతి లోభము వలన పాడైన వాడు దుర్యోధనుడు.

* 21. దీనమైన జీవితము గడపకపోవటం, అనాయాస మరణం-ఈ రెండూ మానవుడు కోరుకోవాలి.

* 22. భర్త సేవకు మించిన అలంకారము లేదు భార్యకు.

* 23. హస్త మస్తక సంయోగం : వధూవరులకు జీలకర్ర వెల్లం శిరస్సుపై పెట్టినప్పుడే ముహూర్తసమయం.

* 24. ధర్మార్థ కామములకు కట్టుబడి వుంటాము-అని వేసేవే వివాహ సమయమున వేసే మూడుముళ్ళు.

* 25. గడప ఇవతల నుంచి భిక్షం పెడితే లక్ష్మి తొలగిపోవును కాబట్టి గడప అవతల నుంచి భిక్షం పెట్టాలి.

* 26. మానవునికి వుండి కనబడకుండా వుండేది దయ. తెలిసి కూడా తెలియనిది మరణం.

* 27. యజమానికి భార్య ఎడమవైపున(ఆమె ఆయన గుండె కాబట్టి), కుమారుడు కుడి వైపున కూర్చొనవలెను(శుభకార్యాల్లో).

* 28. మంగళవాద్యాలతో యిచ్చే స్వాగతము శుభప్రదము. దోసిలి వొగ్గి పిలుచుట గౌరవప్రదము.

* 29. కాళ్ళు చేతితో కడుగుకొనవలెను. కాని కాలు మీద కాలుపెట్టి తోమరాదు.

* 30. అసంతృప్తి ఉన్నవాడు, సంతుష్టి గల-ప్రభువు, సిగ్గు లేని గృహిణి, సిగ్గు వున్న వేశ్య నష్టపోవుదురు.

* 31. జుట్టు విదల్చరాదు. నేలపై శబ్దం చేస్తూ నడవకూడదు(అరిష్టం కాబట్టి).

* 32. దాచవలసినవి : వయస్సు, విత్తము, మంత్రము, గృహచ్ఛిద్రము, ఔషధము(?), సంగమము, దానము, మానము, అవమానము.

* 33. చాలా పూజలు చేస్తూ ఉండి, భర్తను పూజించని స్త్రీ పాతకురాలగును.

* 34. పురుషునికి వైశ్వదేవము చేస్తే ఎంత పుణ్యమో, స్త్రీకి రెండు బియ్యపు గింజలు అగ్నిహోత్రములో వేస్తే అంత పుణ్యము. కనుకనే పొయ్యిలో బియ్యపు గింజలు వేస్తారు.

* 35. పాలలో బియ్యం వేసి వండినది పరమాన్నము.

* 36. తింటున్నప్పుడు చేతిని నాకరాదు.

* 37. సంపాదించేటప్పుడు శాశ్వతమనుకోవాలి. దానం చేసేటప్పుడు ఉండవని చేయాలి.

* 38. హారతి వట్టి చేతితో ఇవ్వరాదు. పువ్వు గాని అక్షతలు గాని చేత పట్టుకుని ఇవ్వాలి.

* 39. స్త్రీలు ఒక గాజుతో ఉండరాదు.

* 40. ఆచమనం చేయునపుడు చప్పుడు కారాదు. క్రింది పెదవికి తగులునట్లు చేయవలెను; 3 పర్యాయములు ఎప్పటికప్పుడు చేతిలో నీళ్ళు పోసుకునవలెను. ఒకేసారి పోసుకుని ముమ్మారు త్రాగరాదు.

* 41. వనిత, పండితుడు, తీగ ఆశ్రయము లేనిదే రాణించరు.

* 42. పిల్లి పిండము కోరుతుంది, కుక్క శుభం కోరుతుంది.

1-42, -ధర్మానుష్ఠాన చంద్రిక - పరిమి రామకృష్ణ శాస్త్రి

## ధైర్యం courage

* మనల్ని కాపాడేవి దైవం, ధైర్యం.

* courage of Casablanca.

* కష్టాలు వచ్చినప్పుడు వాటిని ధైర్యంగా ఎదుర్కోవడమే ఉత్తమ మార్గము. -ప్రజాపిత బ్రహ్మాకుమారీస్
The best way to behave whe n crisis strikes is to be brave.

## నవ్వు laughter

* చిరునవ్వు, మందహాసము smile

* నవ్వు ఊపిరితిత్తులకు ఊపిరి పోస్తుంది. Laughter is a good exercise for the lungs.

* నవ్వు నాణ్యమైన ఔషధము. Laughter is the best medicine.

* చిరునవ్వుతో చికాకు జయించు. Keep away worry with a smile.

* మందహాసం మందికి ఆకర్షణ.

* నవ్వు సామాజిక శ్రేయస్సు సూచిస్తుంది, దివ్యౌషధంలా పని చేస్తుంది.... ... ఖచ్చితంగా చెప్పాలంటే తెరలు తెరలుగా 'కడుపుబ్బించే నవ్వు' కన్నా శ్రేష్ఠమైన, ఆత్మీయమైన శబ్దం మరియొకటి ఈ లోకంలో లేదు.
Laughter is the greatest humanizer and medicine ... ... There is no more beautiful, soul-satisfying sound in all the world than a solid, reverberating 'belly laugh'. -Bennet Cerf

## నిజం reality, fact

* నిజం నిష్ఠురం. Facts are stubborn things. -Smollett

* నిజం నిప్పు లాంటిది. Fact can be frightening.

* 1. నిజం(facts) వేరు, సత్యం వేరు.
2 నిదర్శనం వేరు, సత్యం వేరు. Truth is more important than facts.

## నిజాయతి honesty

* నిజాయతి నిలబెట్టు; వంచన/మోసము తోసిపుచ్చు.
Honesty is the best policy; dishonesty is the worst enemy.

## On Honesty

* The surest way to remain poor is to be honest.
- Napoleon Bonaparte

* Ninety eight of 100 of the rich men in America are honest.That is why they are rich. -Russel Herman Conwell

## నీతి morals

* నీతి వాక్యం నిండుకుండ, సన్మార్గం; అవినీతి ఓటుకుండ, దుర్మార్గం.
Highlight honesty, despise dishonesty.

* నీతులు సంఘం నెమ్మదిగా,శాంతంగా జరిగిపోవడానికి పెట్టిన కట్టుబాట్లు. -చలం

* నీతి తప్పకుండా బ్రతకడం ఉత్తమం. శరీర శ్రమతో, వ్యాపారంతో బ్రతకడం మధ్యమం. నీతి తప్పి మోసంతో బ్రతకడం అధమం, నీచం. -విదురుడు(భారతం). -సూక్తులు-హితోక్తులు-2
విదురనీతి ప్రసిద్ధి కదండీ !

## నేరం offence, crime

* Whoever profits by the crime is guilty of it. -French proverb

* ఉరితీయబడేది దొంగల ముఠా నాయకుడు గాదు. స్తేన చర్య ఆచరించే అమాయకుడు(తొత్తు).
It is not the thief who is hanged, but one who was caught stealing. -Czech proverb

* 'తప్పుచేసినా తప్పించుకుని తిరగగలము' అన్న ధీమాయే నేరప్రవృత్తికి బలమైన ప్రేరణ. సిసెరొ Cicero. -సూక్తులు-హితోక్తులు-2

* కాలు జారడం నేరం కాదు, కారణం తెలుసుకోకపోవడం ఘోరం. -శ్రీశ్రీ

## న్యాయం, చట్టం justice, law

* న్యాయం వేరు, చట్టం వేరు. Justice is different from law.

* చట్టం ప్రకారం వాదన లోతు తెలియని గుంత.
Law is a bottomless pit. -J.Arbuthnot, Title of a Pamphlet, 1700

* వాదనే చట్టానికి ప్రాణం. Reason is the life of the law. -Sir Edward Coke

* క్రూరత్వం చట్టానికి ఆవల/దూరం.
Where law ends, there tyranny begins. -William Pitt

* న్యాయం గెలుస్తుందన్న మాట నిజమే కాని గెలిచిందంతా న్యాయం కాదు. -శ్రీశ్రీ

## పగ enmity

* శత్రువులు పగరాయళ్ళుగా పరిణమిస్తారు; కాని కావాలని ఎవరినీ ఎవరూ శత్రువుగా చేసుకోరు. Enemies evolve; they are not made.

* దైవభీతి లేకపోతే పగకు పగ్గాలుండవు.
If God-concern is not there, enmity knows no bounds.

* పగ ఉంటే వగ తప్పదు/ఉంటుంది.

* పగ గలిగి/రగిలి బ్రతకటం, పామున్న ఇంట్లో బ్రతకటం ఒకటే -సామెత

## పఠనం reading పుస్తకం book

* శరీరానికి వ్యాయామం ఎట్లాగో మనసుకు పఠనం అంత అవసరం.
Reading is to the mind what exercise is to the body. -Addison, *The Tatler*

* గ్రంథపఠనం / చదువు మనిషికి సార్థకత.
Reading maketh a full man. -Bacon, *Of Studies*

* ఒక మహాత్ముని జీవిత సర్వస్వం ఒక ఉత్తమ గ్రంథం. -మిల్టన్

* చదివిన దానిని మననం చేయాలి, జీర్ణించుకోవాలి. అనంతరం ఆచరణలో మన జీవితానికి అంగముగా తయారుచేసుకోవాలి. -గాంధీజీ

## పత్రికలు newspapers

* వార్తాపత్రిక విషయాల జల్లు/వర్షం. Newspaper is a drizzle of items.

* వార్తాపత్రికలు ప్రపంచం యొక్క ప్రతిబింబాలు.
Newspapers are the world's mirrors. -James Ellis

* లక్ష తుపాకులనైనా ఎదిరించగలను కానీ ఒక్క పత్రికను కూడా ఓడించలేను. -నెపోలియన్

* సభలకేగి, అందు సమ్మానము నంది వార్త కెక్కినంత కీర్తిరాదు, వార్త బ్రతుకు కొత్తవార్త పుట్టువరకే. -నార్ల వెంకటేశ్వరరావు

## పరలోకం, స్వర్గం heaven

* స్వర్గం అంటే దైవసన్నిధి
Heaven means to be one with God. -Confucius

* భూతలస్వర్గం, ఉర్దూలో 'ఇరమ్ నూమా'. A heaven on earth. -Milton, *Paradise Lost*

* స్వర్గంలో దేవదూతలు మెండు.
In Heaven an angel is nobody in particular. -George Bernard Shaw

* జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ -ఆర్యోక్తి

## పరోపకారం help to the needy

* పరోపకారార్థ మిదం శరీరమ్. This life is for service to the needy.

* జపతపంబుల కన్న చదువు సాముల కన్న ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా! -శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

* ఉపకారికి నుపకారము
విపరీతముగాదుసేయ, వివరింపంగా,
యపకారికి నుపకారము
నెపమెన్నగ సేయువాడు నేర్పరి సుమతీ. -సుమతీ శతకం

* స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయ్. -గురజాడ అప్పారావు

## పుట్టుక, చావు life and death

* జన్మ భగవంతుని వరం. Birth is a boon of the Lord Almighty.

* పుట్టుక : నగ్నశరీరంతో మాతృశ్రీ ఒడిలోనుండి ఈ సువిశాల ధర్తీమాత మీద వాలడం.
Birth: Cast naked upon the naked earth.

* పుట్టుట గిట్టుట కొరకే. Birth is the shadow of death.

* జనన మరణమ్ములు నాణెమ్మున కిరుప్రక్కల వంటివి. -గాంధీజీ భావన, యువభారతి

## పెద్దమనిషి gentleman

* పెద్దమనిషి: ఏవిషయంలోనైనా ఒప్పుకొనకపోయినా అయిష్టత కలిగించనివాడు.
A gentleman is a man who can disagree without being disagreeable.

* పేదమనిషి అయినా పెద్దమనిషిగా ప్రవర్తించవచ్చు.

* తనకన్నా ఉన్నతులు, తన సమానులూ, తన సేవకులూ-ఈ మూడు తరగతుల వారితో ఏ పేచీ లేకుండా సవరించుకొని ప్రవర్తించు వాడే పెద్దమనిషి. -Jonathan Swift భావన

* ఆదర్శం నిలుపుకోలేని మనిషి అభివృద్ధిని సాధించలేడు. -Goldsmith,భావన

## పెళ్ళి marriage,wedding

* వివాహం: వరుని వధువు తన ఒడిలో వేసుకోవడం.
Marriage : Capture of man by woman

* సహధర్మచారి(ణి): నా ఎముకలో ఎముక, నామాంసం/కండరంలోని మాంసం.
Married Partner : Bone of my bones, and flesh of my flesh.
-Genesis II 23

* వివాహం దైవనిర్ణయం.
Marriages are made in Heaven. -Tennyson

### పాటల పందిరి

* కొత్త పెళ్ళికూతురా రారా నీ కుడికాలు ముందుమోపిరారా!
* 'శ్రీ సీతారాముల కళ్యాణము చూతము రారండి..'
* శ్రీ కారం చుట్టుకుంది పెళ్ళిపుస్తకం 'ఇక ఆకారం దాల్చనుంది కొత్తజీవితం'
* 'కోతీ బావకు పెళ్ళంట కోవెలతోట విడదంట'
* 'సన్నజాజికి గున్న మావికి పెళ్ళి కుదిరింది...'
* 'పెళ్ళంటే నూరేళ్ల పంట...'
* 'పందిట్లో పెళ్ళవుతున్నాది కనువిందవుతున్నది...'
* 'ఆకాశపందిరిలో నీకు నాకు పెళ్ళంట...'

* 'పెళ్ళిచేసుకొని ఇల్లు చూసుకుని చల్లగ కాలం గడపాలోయ్'

* 'మ్రోగింది కళ్యాణ వీణ...'

* పెళ్ళికి ముందే సిగ్గంతా నువ్వొలక బోయకమ్మా! శోభనరాత్రికి అంతో ఇంతో దాచుకోవమ్మా... కాస్త తలపైకెత్తమ్మా!

## పొదుపు frugality, economy

* అవసరంలేనిది కొనవద్దు. Buy not what you don't want.

* పొదుపు చేయనివాడు వ్యథకు గురి అవుతాడు.
He who will not economize will have to agonize. -Confucius

* Economy of thoughts and words in a speech is desirable.

* 'పొదుపు' అనేది మనపై మనం విధించుకునే సుంకం/పన్ను.

* డబ్బు ఉన్నప్పుడే పొదుపు నేర్చుకొంటే, దారిద్ర్యం మీ దరి దాపులకు రాదు.

## ప్రజాస్వామ్యం democracy

* ప్రజలచేత, ప్రజలకొరకు, ప్రజలదియైన ప్రభుత్వం-ప్రజాస్వామ్యం. -అబ్రహాం లింకన్

* ప్రతివ్యక్తికి అభివృద్ధి పొందుటకు అవకాశం కలిగించునదే ప్రజా రాజ్యమగును.
-గాంధీజీ, -భావన

* Ask not what your country can do for you: Ask what you can do for your country. -former US President John F Kennedy

* So long as we have enough people in the country to fight for their rights, we'll be called a democracy. -Roger Baldwin

* Democracy: In a democracy, dissent is an act of faith. Like medicine, the test of its value is not in its taste but in its effects.
-J W Fulbright

## ప్రపంచం world,universe

* మనిషి సంఘజీవి. Man is a social animal. -Seneca

* సిగ్గు లేతవయసు గల స్త్రీకి తగును కాని ముదుసలికి తగదు.
Shyness is an ornament to the young, but a disgrace to the old.

* అగణిత దుఃఖాత్మక మిజ్జగము -తిక్కన

* ప్రపంచమొక పద్మవ్యూహం -శ్రీశ్రీ

* ప్రజల పనియే పాలకునిపని, ప్రజల సుఖమే పాలకుని సుఖము, ప్రజల ప్రియమే పాలకుని ప్రియము; ప్రజలహితమే పాలకుని హితము; ఈ విధముగా ప్రజలతో అవినాభావముగా పాలకుడు ఉండవలెను. -మహాభారతం, భావన

## ప్రవర్తనా నియమావళి Code of conduct

* **భారతదేశ పౌరులకు జాతీయ ప్రవర్తనా నియమావళి**

**1. దేశభక్తి:** మనం మాతృదేశానికి ప్రథమము, అత్యున్నతమైన స్థానము ఇవ్వాలి. దేశ సంక్షేమమే మన సంక్షేమం. అందువల్ల మన దేశం కోసం మన జీవితాలను కూడా స్వచ్ఛందముగా అర్పించుటకు ఎల్లవేళలా సంసిద్ధులము కావాలి. మన సంతానానికి, మన కుటుంబ సభ్యులకు ప్రేమను, దేశభక్తి స్ఫూర్తిని అలవరిచి మన దేశం ఎడల, తోటి పౌరుల పట్ల సేవాభావము కలిగి ఉండాలని ప్రబోధించాలి.

**2. కర్తవ్యం:** మొదట మనకు దేవుని ఎడల ఆయన ధర్మపరాయణత పట్ల ప్రథమ కర్తవ్యం ఉంది. ధర్మపరాయణతో జీవించుటయే మనము జాతికి చేసే అత్యున్నతమైన విలువైన సేవ.

**3. ప్రవర్తన:** ప్రవర్తనే మహత్తరమైన సంపద. స్వచ్ఛమైనట్టి, అవినీతికి పాల్పడకుండా ఉండే పౌరుడే మన జాతి యొక్క ఘనమైన సంపద. జాతియొక్క సంక్షేమం, భవిష్యత్తులో దాని స్థిరత్వము సత్ప్రవర్తన పై ఆధారపడి ఉండటం వల్ల సత్ప్రవర్తనకు అధిక ప్రాధాన్యం ఇవ్వాలి.

**4. ఆరోగ్యం:** విజయానికి పునాది ఆరోగ్యం. ఆరోగ్యమే మహాభాగ్యం. ప్రవర్తన తరువాత మహత్తరమైన జాతీయ సంపద ఆరోగ్యమే; దానిని సంరక్షించడం మన ప్రాథమిక కర్తవ్యం.

**5. సుశీలత(సద్గుణము):** జూదమాడటం, మద్యపానం, మత్తు పదార్థములనను సేవించటం, పొగత్రాగటము వంటి దుష్కర్మలను నిర్మూలించటానికి మనమందరము సహకరించుదాము. లంచగొండితనాన్ని, అవినీతిని, స్వార్థపరత్వాన్ని, నీతి రహిత ప్రవర్తనాన్ని, మోసాన్ని, దురాచరణాన్ని మనం కలిసి నిర్మూలించుదాము. జాతికి ద్రోహం చేయటం మహానేరమే గాక క్షమించరాని మహాపాపము.

**6. ప్రజాసంపద:** ఓ పౌరులారా! ప్రజాసంపదకు మనము సంరక్షకులము. జాతీయ సంపదను పాడుచేయటం, దుర్వినియోగం చేయటము, దొంగలించటము, నాశనము చేయుటవంటి పనులను చేయుట మనకు కూడని పని. ఈ సంపదను ప్రేమతో జాగ్రత్తగా సంరక్షిద్దాము. మనదేశాన్ని స్వచ్ఛముగానూ, పరిశుభ్రముగాను ఉంచుకొందాము. ఇదే మన పవిత్ర కర్తవ్యము.

**7. ఒకే కుటుంబము:** మనదేశ పౌరులందరూ మన సోదరులే. ఈ సౌభ్రాతృత్వాన్ని అనుభవిద్దాము. మనమందరము ఒకే కుటుంబములోని సభ్యులమే కావున ఒకరినొకరిని ప్రేమించుకొందాము. ఐకమత్యముతో ఉందాము.

**8. మతము:** అన్ని మతములపట్ల, మత సాంప్రదాయముల పట్ల, మతవిశ్వాసము పట్ల సమానమైన గౌరవ భావమును మనం కలిగి ఉండాలి. ఇతురులు మనతో ఏ విధంగా ప్రవర్తించాలని మనం భావిస్తామో అదే విధముగా వారితో మనమూ ప్రవర్తించుదాము.

**9. అహింస:** ప్రతి ఒక్క రకమైన హింసను, ద్వేషాన్ని ఎన్నో కష్టనష్టాల కోర్చి అయినా విడనాడుదాము. దేశం యొక్క మంచి పేరుకు హింస మాయని మచ్చను ఏర్పరుస్తుంది. ప్రాణి హింస దేశ సంక్షేమానికి, పురోభివృద్ధికి అపారనష్టాన్ని కలిగిస్తుంది. మన జాతి ఆదర్శానికి హింస సంపూర్ణముగా వ్యతిరేకమైంది.

**10. ఆర్థిక వ్యవస్థ:** సరళజీవనాన్ని సాగిస్తూ ఉన్నతంగా ఆలోచించే విధానాన్ని అనుసరిద్దాము. మనం దుబార ఖర్చులు చేయకుండా, అధిక వ్యయాన్ని నివారిద్దాము. మితవ్యయం పాటించుదాము. మనకంటే దురదృష్టవంతులైన పౌరులతో మనకు ఉన్నదానిని పంచుకుందాము. ఈనాడు మనదేశానికి కావలసిన జాతీయ సౌశీల్యత యిదే.

**11. శాసనం:** న్యాయ శాస్త్రనియమాన్ని గౌరవిద్దాము. సాంఘిక న్యాయాన్ని నిలబెట్టుదాము. దీనిలోనే మన సంక్షేమానికి అభయమూ, శ్రేష్టతరమైన క్రమబద్ధమైన భారతదేశ పురోభివృద్ధి ఇమిడి ఉన్నాయి.

**12. అహింస:** హాని చేయకపోవటమే మన మహోన్నతమైన సుశీలత(అహింసో పరమో ధర్మః), కరుణ, దైవిక సంపద. జంతు సంరక్షణ మన పవిత్రమైన కార్యము. ఇదే భారతదేశపు ప్రత్యేక ప్రబోధము. సర్వజీవుల యెడల కరుణతో మెలగుదాము. ఆ విధముగా నిజమైన భారతీయునిగా ఉందాము. నిత్యజీవితంలో కూడా మనము కరుణకు, దయాళుస్వభావానికి, మంచితనానికి మూర్తీభవించినవారమనడానికి తగి ఉందాము.

**13. ఆవరణ శాస్త్రము :** మానవుని, ప్రకృతిని వేరు పరచలేము. మానవునికి అతని సహజ పరిసరాలకు పరస్పర సంబంధము, అన్యోన్య సంబంధాలు ఉన్నాయి. ప్రకృతిలో ప్రతి వస్తు సంపద మన రక్షణకు, పోషణకు తోడ్పడతాయి. అందువల్ల మన సహజ పరిసరాలను సంరక్షిద్దాము. ఆవరణ సమతుల్యాన్ని కొనసాగించటానికి సహాయం చేయుటయు మన కర్తవ్యము. మనం సురక్షితముగా జీవించడానికి అత్యుత్తమమైన సంక్షేమానికి ఇది అనివార్యము. మన దేశంలోని బహిరంగ ప్రదేశాలను, గాలిని, నీటిని కలుషితం చేయటం జాతీయ నేరము. గతంలో చేసిన తప్పులను మనం సవరించుకొందాము.

**14. ఐకమత్యము:** ఒక దేశ ప్రజలలో ఐకమత్యము ఎంత ఎక్కువగా ఉంటే అవరోధాలను, అపాయాలను అధిగమించే శక్తి అంత ఎక్కువగా ఉంటుంది. ఐకమత్యం మనుగడకు, విభజనం పతనానికి కారణమవుతుంది. అందువల్ల సన్నిహితమైన సామరస్యముతోనూ, ప్రేమపూరితమైన సౌహార్దంతోను, మన దేశప్రజలందరితోను కలిసి జీవిద్దాము. దేశభక్తి అంటే దేశప్రజలను ప్రేమించటమే. భారతదేశ పౌరునిగా మాతృభూమికి చేయగలిగిన అమూల్యమైన సేవ ఇదే.

**15. విద్య :** భారతదేశపు మహోన్నతమైన సంస్కృతిని దాని ఉన్నతమైన ఆశయాలను, ఉత్తమమైన విలువలను, జీవన సూత్రాలను అందించే మౌలిక విజ్ఞానమును విద్యావిధానములో పొందుపరచాలి. మన యువత యొక్క, విద్యార్థుల యొక్క జీవన విధానాన్ని సుసంపన్నం చేయటానికి, వృద్ధి చేయటానికి మన విద్యావిధానం ఉండేలాగ నిర్ణయించాలి.

ఆ విధంగా మీదైన జీవిత విధానంతోను,ప్రవర్తనతోను మెలిగి, నిజమైన పౌరునిగా పేరును సంపాదించుకొని మీ దేశాన్ని సర్వోత్తమముగా సేవించండి.

## జైహింద్

* 'దివ్య జీవన దశాబ్దము' 1990 నుండి 1999
Dedicated with affectionate friendship & Oneness to all citizens of our India, Hindus, Buddhists, Jains, Jews, Christians, Zorastrians, Muslims, Sikhs alike

## NATIONAL CODE OF CONDUCT

(For Citizens of India)

**1. Patriotism:** Our Mother land should be our first and highest consideration. Welfare of the Nation is our own welfare. Therefore, let us willingly be ready to offer up even our own lives for our country. Let us inculcate in our children and members of our family love for our country, the spirit of patriotism and service to our country and our fellow citizens.

**2. Duty:** Our first and foremost duty is to God, and to Righteousness. Leading a righteous life is the best and most valuable service to our Nation.

**3. Character:** Character is the greatest wealth. A pure, incorruptible citizen is the greatest asset of our Nation. This is vital and indispensable. Therefore, good character is to be given top priority, value; upon this depends our nation's welfare and its future stability.

**4. Health:** Health is the basis of success. Health is wealth. Next to character, it is the greatest national asset. As citizens, building up character and safeguarding health, should be our primary duty to the Nation.

**5. Virtue:** Let us join hands and eradicate the evils of gambling,liquor-drinking, drug-taking, tobacco-smoking and betel-chewing. Let us eradicate the evils of bribery, corruption, selfishness, immorality, dishonesty and misconduct. Disloyalty to our Nation is a crime and an unpardonable sin.

**6. Public Property:** O Citizens! We are the custodians of public property. Let us not spoil, misuse, steal or destroy National property. Let us preserve it with love and care. Let us keep our country neat and clean. This is our sacred duty.

**7. One Family:** All our citizens are brethren. Let us feel this fraternity. Let us all love each other and one another and be united because we are one family.

**8. Religion:** We must have equal reverence for all religions, creeds and faiths. Let us love as our own brothers the followers of other faiths. Let us treat others as we wish to be treated by them.

**9. Non-violence:** At all costs avoid every type of violence and hatred, for this is a blot on the fair name of the Nation. It is soul-killing and causes great harm to our country's welfare and development. It is totally opposed to our Nation's ideal.

**10. Economy:** Let us adopt simple living and high thinking. Let us not be extravagant. Let us avoid waste. Let us practice frugality. Let us share what we have with our less fortunate fellow citizens. This is the National virtue that our India needs today.

**11. Law:** Let us respect the rule of law and uphold social justice. In this lies the guarantee of our welfare and orderly progress towards better India.

**12. Ahimsa:** Non-injury is our highest virtue(Ahimsa Paramo Dharmah). Compassion is a divine quality. Protection of animals is our sacred duty. This is India's special teaching. Let us be compassionate towards all creatures. Thus be a true Indian. Try to become an embodiment of kindness, compassion and goodness in your every day life.

**13. Ecology:** Man and Nature are inseparable. Man and his natural environment are inter-related and mutuallly interdependent. Everything in Nature contributes to our protection and nourishment. Let us, therefore, protect our natural environment. Helping in maintaining the ecological balance is our duty. It is indispensable for our safe living and highest welfare. Polluting of public places and polluting of air and water of the country is a national crime. We must make amends for our past lapses.

**14. Unity :** The more united the people of a country, the greater is their ability to withstand all obstacles and dangers. United we stand, divided we fall. This is particularly true about today's India. Therefore, let us live in close harmony and loving goodwill with all our contrymen. Love of our country means love of our contrymen. This is the most invaluable service a citizen of India can offer to his Motherland.

**15. Education:** The process of education should incorporate within it the imparting of the basic knowledge of India's great culture, it's lofty ideals and noble values and principles of living. Our education has to be oriented for enriching and enhancing the quality of life, of our youth and students.

Thus, shine as a true citizen and serve your country best by the very manner of your life and conduct.

Lovers of the country

**Jai Hind**

**"Divine Decade"- 1990 to 1999.**

A.P. Divine Life Society, Sri Sivananda Ashram, 6-1-110, Padmaraonagar, Secunderabad.

* Character which includes being good, efficient work and truthfulness and purity of mind, is the Keystone of the arch both in individual life and in national life.

-C.Rajagopalachary, Bhavan's Journal , August 15, 2001.

ప్రార్థన prayer

* కరదర్శనము:
కరాగ్రే వసతే లక్ష్మీ కరమధ్యే సరస్వతీ కరమూలే స్థితా గౌరీ ప్రభాతే కరదర్శనమ్.

Memento of manus/hand:
O Manus! Reminder of hand! Glory to thee! Prostrations to Goddess Lakshmi at the edges, Goddess Saraswati at the middle (centre), Goddess Gowri at the root(of the hand).

* స్నానసమయమున: గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు.

At the time of bath: I extol Thee! Sacred Rivers Ganges, Yamuna, Krishna, Godavari, Saraswati, Narmada, Sindhu, Cauvery. I come nearer to you.

* హరేరామ హరేరామ, రామ రామ, హరే హరే,
హరేకృష్ణ హరేకృష్ణ, కృష్ణ కృష్ణ, హరే హరే. -ఇది ఉపనిషత్తు మంత్రం

'హరి' అంటే హరించివేయునది అని అర్థము. మనస్సును ఆవరించియున్న మాయావృత్తులను హరించివేయునది. 'రామ' అంటే ఆనందాన్ని కల్గించు తత్వం అని అర్థం. 'కృష్ణ' అంటే నిర్వృతితత్వం, భగవంతుని లో లీనమై పోవడానికి కలిగే భగవదాకర్షన. -వ్యాసులవారు (కలి సంతారణోపనిషత్)

* అశ్వత్థ వృక్ష దర్శన సమయమున ప్రార్థన:
మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే అగ్రతః శివరూపాయ వృక్షరాజాయతే నమః

Pipul tree : Prostrations unto you, O King of Trees! who are Brahma at your root, Vishnu in the trunk and Siva at the branches. -Brahma-Narada Samvada

* నవగ్రహములు (ఏడురోజులు,రాహువు,కేతువు): ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః
*Nine 'grahas'- Planets* : Salutations to Thee! Sun, Moon, Mars, Mercury, Jupiter, Venus, Saturn, The Moon's Ascending Node, The Dragon's Descending Node.

* **శాంతి**
ఓమ్ అసతోమా సద్గమయ-తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ-ఓం శాన్తిః శాన్తిఃశాన్తిః

సర్వేజనాః సుఖినో భవన్తు లోకాస్సమస్తాః సుఖినో భవన్తు.
Peace be unto all!

* ప్రార్థన చేసే పెదవులకన్నా సాయం చేసే చేతులు పవిత్రమైనవి.
The hands that help are holier than the lips that pray.

## ప్రేమ love

* ప్రేమతో మాట్లాడే ఒక్క మాట అయినా ఎందరో దుఃఖార్తుల హృదయాలకు ఊరటనిస్తుంది. One word spoken with love can soothen the sorrowful hearts of many. -modified from Brahma Kumaris

* అందరినీ సమాన ప్రేమతో చూడు; సమదృష్టి కలిగి యుండు. (సర్వత్ర సమబుద్ధయః)
Have equal love towards all, have equanimity.

* ప్రేమ రథానికి త్యాగము, సేవ అనునవి రెండు చక్రాల వంటివి. -స్వామి సుందరచైతన్యానంద

* నిన్ను నువ్వు ప్రేమించుకోవటం నేర్చుకున్నట్లయితే అది నిన్ను ఇతరులను ద్వేషించడం నుండి విముక్తుణ్ని చేస్తుంది. Learning to love yourself frees you from hatred of others. -Brahma Kumaris

* ప్రేమ మనస్సులను కలుపుతుంది; కామం కాళ్ళ మధ్య కలయిక.
Love is between two minds; lust is between two legs.

* నా వద్ద ప్రేమ తప్ప మరో ఆయుధంలేదు. ప్రపంచంలో స్నేహంగా మెలగడమే నా ధర్మం. -గాంధీ. -సూక్తులు-హితోక్తులు. 2

* ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును. ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును. -గురజాడ

* బంధాలెన్నో వున్నాయి లోకంలో, కాని ప్రేమ బంధానికి చాలింది లేదు. -చాణక్యుడు, భావన

* తల్లి ప్రేమ కన్నా మిన్న అయినది దైవప్రేమయే; తతిమ్మావన్నీ తక్కువే.
The love of God is the only love that is higher than a mother's love; all others are lower. -Swami Vivekananda

* దైవాంశసంభూతుడైన మానవుని హృదయం ప్రేమమయం. సానుభూతి, దయ,కరుణ, దానం, త్యాగం ప్రేమ యొక్క సహజలక్షణాలు. వీటిని పెంపొందించుకుంటూ, అసహజమైన స్వార్థం, అహంకారం, ఆడంబరం వంటి మాలిన్యాన్ని హృదయం నుండి పారదోలాలి. తోటిమానవుల సేవ వలన కలిగే ఆత్మానందమే ప్రేమామృతం. -సత్య సాయిబాబా

## బాధ pain

* మైగ్రేయిన్ మేధావి మేధకు ముల్లు లాంటిది. Migraine is a stimulus to the brain of an intellectual.

## బాల్యం childhood

* The child is father of the man. -Wordsworth
పదాలవిలువ

* As morning shows the day, The childhood shows the man.
-Milton, *Paradise Regained*

* మొక్కై వంగనిది మానై వంగుతుందా?

* అసలు బ్రతుక్కి ఆనందపు ఏ లిమేర పసితనం కాక మరేముంది చెప్పండి. -దాశరథి
* నేటి బాలలే రేపటి పౌరులు. Today's tots are tomorrow's citizens.

భంగపాటు fall,failure

* ఓటమి అనేది బాట మీది లోతు మాత్రమే, గమ్యం సాధించడానికి తుది ఆటంకంగాదు. Failure is just a bend on the road, not the end of a journey.
* కష్టాల్లో గట్టెక్కడానికి సమచిత్తత/స్థైర్యం అవసరం. Bear thy hardships with equanimity. -Mahavira
* విజయంతో విర్రవీగవద్దు, అపజయంతో క్రుంగి పోవద్దు. Let not success go to your head, nor failure to your heart -Lifco Dictionary
* భంగపాటుకు వెరవకుండా దిగజారిపోయినప్పుడల్లా తిరిగి సమస్యను ఎదుర్కొనడం ధీరుని లక్షణం. Our greatest glory is not in never falling but in rising every time we fall. -Oliver Goldsmith
* నిన్నటి ఓటమి/ భంగపాటు ఈ రోజు విజయం అవచ్చు. Yesterday's failure can become today's success.
* ఓటమి విజయానికి బాట/నాంది. Failure is a stepping stone to success.
* నేటి వైఫల్యం రేపటికి గుణపాఠం. -సూక్తులు-హితోక్తులు. 2
* చిక్కులే మనిషిని ముందుకు నడిపిస్తాయి. -Napoleon
* నిదానమే ప్రధానం. వేగం భంగపాటు. Wisely, and slow. They stumble that run fast. -Shakespeare
* భవిష్యత్తును గూర్చిన భయాలలోనే మనం నిమగ్నమై ఉంటే వర్తమానం మనకు అందించే అవకాశాలు చేజారిపోతాయి. If we get involved in fears about the future, we shall miss the chances that the present offers us. -Brahma Kumaris

భక్తి *bhakti*, devotion

* ఎవరి ముఖము చూడగానే చూచినవారికి భగవంతుడు జ్ఞాపకము వచ్చునో, అతడే నిజమైన భక్తుడు. -శ్రీ మళయాళస్వామి

* చక్రిచింతలేని జన్మంబు జన్మమే తరళ సలిలబుద్బుదంబుగాక -పోతన

* భక్తితోడ గల్లు పట్టెడన్నమె చాలు -వేమన

## భయం fear

* భయం భేతాళం, అభయం ఆనందం.
Fear is a nightmare but faith is like a fine pillow.

* భయాన్ని గురించే భయపడాలి.
The only thing we have to fear is fear itself. -F.D. Roosevelt

* దైవభీతి ఉంటే జ్ఞానోదయం కలుగుతుంది.
The fear of the Lord is the beginning of knowledge. -Proverbs I.7

* విజ్ఞానం మరియు అవగాహన భయాన్ని పారద్రోలే మార్గాలు.
A simple way to remove fear is to seek knowledge and understanding.

## భాష language

* భాష, మాట దైవం ఇచ్చిన తొలి వరాలు.
Language, as well as the faculty of speech was the immediate gift ofGod. -Noah Webster

* భాష : మహనీయుల కార్యాలు, ప్రజల అవసరాలు, బంధాలు, వేడుకలు, సన్నిహితం/ప్రేమ, రుచులు, అభిరుచులు-వీటి నేపథ్యంలో దీర్ఘకాలంగా తరతరాల్లో వికసించిన పుష్పం.
Language... is something arising out of the work,needs, ties, joys, affections,tastes, of long generations of humanity.
-Walt Whitman, *Slang in America*

* దేశభాషలందు తెలుగు లెస్స.

* మాతృభాషా తృణీకారము మాతృదేవీ తిరస్కారము. -గాంధీజీ, భావన

## మంచితనం virtue

* ఇతరుల సంక్షేమం కోరుకో. Wish well for others.

* మంచిగా ఉంటే మనుగడలో సుఖం.
Righteousness is the root of happiness. -Chanakya

* Righteousness లో 'right' ఉన్నది; it indicates purity of heart and conduct.

* Virtue: The discovery of what is true and the practice of that which is good... -Voltaire

* నీకు కూడనిది ఇతరులకు పంచవద్దు.
Do not do to others what is disagreeable to yourself: that is virtue. -Mahabharata

* చెడుని దగ్గర చేరనీకు, మంచి చెయి.
Eschew/shun evil deeds and do good. -Buddha

* మంచి చెయి-ఇది కొంతమందిని ఆకర్షిస్తుంది. కొంతమందిని నిర్ఘాంతపడేట్లు చేస్తుంది.
Always do right-this will gratify some and astonish the rest.-Mark Twain

* మంచితనమే మనకు శ్రీరామరక్ష.

* కష్టపడి సంపాదించు కొనవలసింది కీర్తి. కష్టపడి నిలిపి ఉంచుకోవలసినది గౌరవం.
-సూక్తులు -హితోక్తులు. 2

* చేసిన చెడ్డపని తిరిగి చేయకుండా వుండటమే నిజమైన పశ్చాత్తాపం.

* ఇతరులలోని మంచి గ్రహించు, అది నేర్చుకో. Learn everything that is good from others. -Swami Vivekananda

* పంచిపెట్టిన కొద్దీ పెరిగేది మంచితనం ఒకటే.
Virtue grows as you extend good wishes to many more(people).

* What is the real good ?
Order, said the law court; Knowledge, said the school;
Truth, said the wise man; Pleasure, said the fool;
Love, said the maiden; Fame, said the leader/politician;
Equity, said the seer.

* ఒకప్పుడు దూషణ భూషణగా భావించాల్సివస్తుంది.
At times, you have to bless men when they revile you.

## మతం religion

* మనసుని అమలం చేసేది మతం, చేయనిది భూతం.
మంచి మనసు-మంచి ప్రవర్తనలే మతం. -శ్రీహరి రామనాథ్

* మతం మానవ గతికి మత్తుమందు. Religion is a dope.

* శ్రద్ధ మతమునకు మూలాధారము. అదిలేకున్న మతమే లేదు. -గాంధీజీ
'*Shraddha*' is the pivot of human religion/existence.

* హిందూమతంలో మానవుడు ఉత్తమ స్థితిని పొందుటకు మూడు మార్గాలు.
1.కర్మ 2. భక్తి 3. జ్ఞానము. -జటావల్లభుల పురుషోత్తం

* This is my simple religion: ...Our own brain is our temple, our own heart is our temple; the philosophy is kindness. -Dalai Lama

* క్రీస్తు, మహమ్మద్ మానవులుగా పుట్టి, దైవాన్ని చేరుకున్నారు. -ప్రాచీనుల మాట

* మహాత్మాగాంధి దైవాంశ సంభూతుడు.

* The Day of Judgement: చిత్రగుప్తుని చిట్టా

The records of all the deeds of individuals, communities, and mankind at large, will be there without the slightest error or omission - records of all human actions in the material world. The limbs, the ears, the eyes and all other parts of the human body will stand witness how they were used or abused in life. On the basis of this unimpeachable evidence and those complete records, the Supreme Sovereign of the Universe, Lord Almighty will decide each case with perfect Justice and pronounce the reward or penalty as the case may be.

Neither death nor coma will be able to relieve the pain and distress of the sufferer.

* మతం అంటే సిద్ధాంతాలు కావు, మనిషి మనుగడరీతి. The secret of religion lies not in theories but in practice. -Swami Vivekananda

* నిర్మల హృదయం, సత్యవాక్కు, నిష్కామకర్మ, విధినిర్వహణ- ఏ మతమైనా చెప్పేది యివే! -సుభాషితం-సూక్తులు-హితోక్తులు. 2

* For God-fearing men all religions are good and equal, only the followers of different religions quarrel against one another and thereby deny their respective religions.

* Religion is no test of nationality, but a personal matter between man and his God.

Hindus, Muslims, Parsis, Christians and others are equally the sons and daughters of India and have equal rights of citizenship.
-M.K.Gandhi. Father of the Nation, Bhavan's Journal, August 15, 2001

## The True Religious Life

Dr. S.RadhaKrishnan

The aim of life... heroism and happiness. Most of us admire self-control on the stage but shrink from it in life.

The spirit of Socrates when he drank death enthralls our imagination; he did not shrink from death to which his judges condemned him.

The crucifixion of Jesus touches our heart.

-Bhavan's Journal, August 15, 2001

## మనస్సు mind

* మనస్సు మర్కట పోకడ పోతుంది. -Dr. O.A. Sarma, *Medical Dictionary*

The mind ... ... ... can make a heaven of hell, a hell of heaven.
-Milton

* చేతిలోని కలం మనోగంటం. The pen is the tongue of the mind.
-Cervantes, *Don Quixote*

* మానవుని మనస్సు ఒక ఊట బావి. -జిడ్డు కృష్ణమూర్తి

* చేతులు కలిసిన చప్పట్లు, మనసులు కలసిన ముచ్చట్లు.

## మరణం death

* పుట్టుట గిట్టుట కొరకే. We begin to die as soon as we are borr and the end is linked to the begining. -Maniliu

* God's finger touched him, and he slept. -Tennyson, *In Memoriai*

* మరణం యమధర్మరాజు పిలుపు. Death is a visitation from God.

* శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్య చ
తస్మాత్ అపరిహార్యేఽర్థే నత్వం శోచితుమర్హసి.

With noiseless tread death comes on man,
No plea, no prayer delivers him;
From midst of busy life's unfinished plan,
With sudden hand, it severs him;
And ready or not ready, -no delay,
Forth to his Judge's bar he must away ! -Schiller. *William Tel*

* పుట్టుక మనచేతిలో లేదు; కాని చావు మనం అర్థం చేసుకొని సరిగా(పేరుపొంది) చద్దాము. చనిపోయిన తర్వాతగూడా బ్రతికి ఉందువారు: మహాత్మాగాంధి, శంకరాచార్యులు, వగైరా.

* Death is hereditary; no doubt about it.

## ముక్తి *mukti*, liberation

* క్షమ, దయ, కరుణ, ఋజుప్రవర్తనము, నిత్యసంతృప్తి- ఇవే ముక్తికి సులభమార్గాలు.
-ఋషిప్రోక్తం. -సూక్తులు-హితోక్తులు. 2

## మూర్తిమత్వము personality

Personality is the integrated organisation of all the psychological, intellectual, emotional and physical characteristics of an individual, especially as they are presented to other people.

## మేధావి intellectual person

* అనేక విషయాలను కొద్ది మాటలలో చెప్పడం మేధావుల లక్షణం. -భావన
Brevity is the soul of speech.

## మోక్షం *moksha*, salvation

* మోహము విడుచుటయే మోక్షము. -అన్నమయ్య
* చికిత్సాశాస్త్రమున నాలుగు వ్యూహములున్నవి. రోగమననేమి? రోగహేతువేది? ఆరోగ్యమననేమి? ఆరోగ్యమునకు ఉపాయము అనగా చికిత్స ఏది?
అట్లే వేదాంతశాస్త్రమున కూడ నాలుగు వ్యూహములు: సంసారమననేమి? సంసారహేతువేది? మోక్షమననేది? మోక్షోపాయమేది? అని. ఇది వ్యాసులవారి వివరణము. -నైష్కర్మ్యసిద్ధి, -భావన
* కామిగాక మోక్షకామిగాడు. -వేమన

## మోహం passion, concupiscence

* నారీ కుచభర, నాభి ప్రదేశమును జూచి మోహావేశమును పొందకుము. -శంకరాచార్య
* రెండు కాళ్ళసందున/మధ్య కామం దాగి ఉన్నది. Lust is in between the two legs.

## మౌనం silence

* ఒకప్పుడు వాగుడు కన్నా మౌనం మంచిది. At times, silence is golden. I regret often that I have spoken, never that I have been silent. -Syrus
* తర్కవాదములాడి దారి తప్పి మాటలాడుట కంటె మౌనంబు బహుమేలు... -వేమన
* మౌనం నిద్రలాంటిది. ఎందుకంటే అది బుద్ధిని వాడిపోనివ్వదు. -Bacon. -భావన
* మౌనం అర్ధాంగీకారం. Silence gives half consent.
* అలజడితో చల్లారదు అలజడి, మౌనమ్మొకటే దాని నణచునది. -గాంధీజీ,-భావన

## యౌవనం youth

* యౌవనంలో నేర్చుకుంటాం; వయసు ముదిరిన కొద్దీ నేర్చుకున్నది అర్థం చేసుకుంటాం. In youth we learn; in age we understand.-Marie Ebner-Eschenbach
* యౌవనము దోషములకెల్ల నాస్పదంబు. -శ్రీనాథుడు

## రాజకీయాలు politics, politicians

* రాజకీయాల్లో శాంతికి బాట శాంతిదూతలు వేస్తూనే ఉంటుంటారు.
In politics, the road to peace is being laid often.

* Wars : The military does not start wars. Politicians start wars.
-William Westmoreland

* Politics is a bed of ruses. -Graffiti

## లోకం రీతి/పోకడ ways of the world

* నీసాటివారికి, నీపైవారికి నీవంటే అసూయ. నీకంటే తక్కువ ఉన్నతి వారికి నీమీద ద్వేషం, ఈర్ష్య. జాగ్రత్త! -మురళీకృష్ణ

* స్త్రీలు కనుకొలకుల ద్వారా అపూర్వ సందేశాలు పలికిస్తారు. నయగారమే వారికి గల అద్భుత ఆయుధం. -సూక్తులు-హితోక్తులు. 2

* స్త్రీకి అనుమానం ఎక్కువ, పురుషునికి అధికారం ఎక్కువ. -పచ్చిగోళ్ళ సుధ

* పురుషుడు బాధను అపాత్రశిక్షగా భావించి ఓర్చుకుంటాడు, కాని స్త్రీకి పురిటి నొప్పులు సహజ అనుభవమే కదా!

* కొన్ని ఘట్టములలో ఏకాంతాన్ని పోలిన సహచరుడు మరియొకడు లేదు/ఉండదు.

* కాలంగతి, సముద్రపు పోటు ఎవ్వరూ ఊహించలేరు. Time and tide wait for no one.

* పలుకుల వల్ల పర్యవసానం పలుకబడి కావచ్చు, పతనం కావచ్చు.
One's development or decline depends on one's tongue.

* మానవ దుష్కార్యములకు "నా ఖర్మ" అనటం ఒక మబ్బు తెరలాంటిది.
"Destiny is the scapegoat which we make responsible for all our crimes and follies". -Davis

* సుదీర్ఘ పరిచయానికి శిక్ష నిర్లక్ష్యం. Familiarity breeds contempt.

* పార్లమెంటు కార్యకలాపాల్లో ఉద్రిక్తత తగ్గించడానికి ఉపాయం: వాయిదా. వాయిదావేస్తే ఏ ఘట్టానికైనా వేపు తగ్గుతుంది.
To quell a heated discussion on any issue in Parliament proceedings: Adjourn, to ameliorate the gravity of the situation.

* Human beings, who are almost unique in having the ability to learn from the experience of others, are also remarkable for their apparent disinclination to do so. -Henry Brooke Adams

* మూక ఆలోచించదు, చప్పట్లు కొడ్తుంది, అంతే! A crowd doesn't think, it cheers.

* పిరికిపంద పారిపోతాడు. A coward thinks with his legs.

* పోచికోలు కబుర్లు మంచివి కాక పోయినా చెప్పుకుంటూ ఉంటారు.
Gossip is what nobody claims to like, but what every one enjoys. -Graffiti

* నిన్ను కన్న వాళ్ళకన్నా నీవు కన్నవాళ్ళను ప్రేమించడం లోకం రీతి.
"To love the one you have given birth to" is more important than 'to love the one who gave birth to you'.

* భిన్నాభిప్రాయాలు ఉన్నా, ఐకమత్యంతో జీవిస్తుంటాం. We live in unity amidst diversity.

* క్షమాపణ అంటే సమాధానపడి సర్దుబాటు చేసుకొనటం. ఇది లేకపోతే విరోధిని ప్రేమించటం జరుగదు. Forgiveness means reconciliation. Without this, no man can love his enemies. -Martin Luther King

* సానుభూతికి ప్రతివాడు ఉబలాట పడుతాడు. తనకృషి గుర్తింపుకు పొగడ్త మరియు మెప్పు గీటు రాళ్ళు.
Every one is extremely susceptible to sympathy. Appreciation and approval are like wings to one's efforts. -V.K.Sarma

* గుర్తింపు దక్షతకు గీటు రాయి.
Recognition is the yardstick of one's achievement

* సంతాపసభ: పెదిమల కదలికేగాదు, హృదయవేదన వ్యక్తపరచాలి.
Let condolence be not lip-sympathy alone, but real heartache.

* మనస్సాక్షిగా మనీషి తన కర్తవ్యం నెరవేర్చితే, అదే తన కృషికి తనకు తాను ఇచ్చుకున్న పారితోషికం.
The pleasure a man of honour enjoys is the consciousness of having performed his duty, which is itself a reward he pays himself for all his pains. -modified from La Bruyere

* చదువు మనిషికి హుందాతనం ఇస్తుంది. సమావేశాల్లో పాల్గొనడం అతడ్ని కార్యసంసిద్ధుడుగా చేస్తుంది. రచనా కౌశలం అతనిని తీర్చిదిద్దుతుంది.
Reading maketh a full man; Conference a ready man; and Writing an exact man. -Bacon

* నీ కుమారుడు: చేప చేతికి ఇస్తే ఇవాళ తింటాడు; చేపలు పట్టడం నేర్పిస్తే జీవనబాట చూపించినట్లు. Give your son a fish, he'll eat today. Teach him fishing, he'll live happily.

* పేదరికం పెనుభూతం. Poverty is frightening.

* Way of the world: Often repeated dictum: "What the mind does not know, the eyes do not see", is quoted. -MPS Menon

* దృష్టిలో లేకపోతే దూరమయినట్లే. "Out of sight out of mind", is also quoted.

* ఒకరికి సహకరించడం అంటే బానిసగా అవ్వడం కాదు.
Being co-operative does not mean becoming a slave.

* సర్వత్రా/ఎల్లప్పుడు/ఎల్లవేళలా జయాన్నే కోరు, కాని పుత్రుల వద్ద(శిష్యుల వద్ద) పరాజయానికి బాధపడకు. Aim at success ever/always/at all times; but don't get upset for defeat at the hands of children(pupils).

* ప్రగతి బాట కొరకు ఉవ్విళ్లూరుతూ ఉంటాం, కాని భూతకాలం యొక్క విశిష్టత/ జ్ఞాపకాలు మరచిపోలేం. There is no doubt we progress, but we still pine for the good old days.

* జ్ఞానమే బలం. Knowledge is Power.

* శలవు రోజంత సులువు రోజు మరొకటి లేదు. There is no easy day like a holiday.

* రసజ్ఞ పళ్ళు ఆవరించియున్న పంజరంలో నృత్యం చేస్తూనే ఉంటుంది, కాని వాటి వల్ల ఏ మాత్రం కొరకబడదు. The tongue dances in the mouth caged by the teeth, yet it does not get injured.

* లోకం రీతి : భీముడు: పెంపుడుకుక్క యొక్క యజమాని. రాముడు: రోడ్‌మీద ప్రక్కగా నిదానంగా నడుస్తున్న పాదచారి. భీముని యొక్క కుక్క రాముని కరుస్తుంది. రాముడు: ఏమయ్యా బాబూ, కుక్కను అదుపులో పెట్టుకోలేదు. పాదచారిని కరిస్తే అతనికి ఎంత ఇబ్బందో గ్రహించారా? భీముడు: నీవు కుక్కను జడిపించి ఉంటావు, అందుచేత కరిచింది. రాముడు: కాదు బాబూ నేను నా ఆలోచనలో నడుస్తూ పోతున్నాను. భీముడు: అయితే, నెమ్మదిగా నడుస్తుంటే 'దొంగ' అనుకుని నిన్ను కరచిఉంటుంది... ఇదీ వరుస.

* దెబ్బకు దెబ్బ. Tit for tat.

* ఈ ఊరికి ఆ వూరు ఎంతదూరమో ఆవూరికి ఈ ఊరు అంతదూరం.

* ఇస్తి వాయనం పుచ్చుకుంటి వాయనం.

* అపకారికి నపకారము: వంచనకు బదులు. Tit for tat.

* దొంగసంతకాలు పట్టుబడతాయి. Forgeries can always be detected.-John Fredman

* ప్రయాణ ప్రారంభంలో గమ్యస్థానం అగుపడదు; కాని గమ్యస్థానం చేరుకోవాలంటే ప్రయాణం మొదలుపెట్టాలి కదా! One's destination is not visible at the start; but one must start to reach the destination.

* Trouble is a tunnel through which we must pass and not consider it as a brick wall against which we have to break our own heads. -modified from G.B. Shaw

* ఆలస్యం తప్పు కన్నా ఆమోదకరం. Delay is preferable to error.-Thomas Jefferson

* మనిషి శీలసంపద అద్దంలో కనిపించదు. One's character is not visible in a mirror.

* విమర్శకులకు 'నింద' అనేది ఒక బాణము. Critics practice the fine art of depreciation.

* పొగడ్తకు పొంగిపోతే నిందకు కుంగిపోతావు. If you are elated by flattery, it is likely that you are depressed by adversity.

* గుంపు/జనసమూహం/మూక ఆలోచించదు. కాని చప్పట్లుకొడుతుంది.
A crowd doesn't think, but it cheers.

* నా సలహా తీసుకో నాకది అక్కరలేదు గాబట్టి Take my advice- I won't be using it.

* దేనినీ ఆశించకు! అప్పుడు నిరాశచెందవు.
Expect nothing! you'll never be disappointed.

* Say *Hello* to the wanted(people), say *Hell(o)* to the unwanted!

* పిల్లలందరూ సుఖంగా నిద్రపోతుంటే తల్లితండ్రులకు ముదం.
The joy of parenthood is what the parents experience when all the kids are in bed.

* నాకు వచ్చే జీతం బకాయిల జాబితా మాత్రమే.
My paycheck is just a receipt for deductions.

* మనతో ఏకీభవించేవాడే 'వివేకి' అని మన అంచనా.
  A sensible person is any one who agrees with us.-Deccan Chronicle

* నిద్రపట్టని వానికి కల రావడం అనేది ఒక ఆశాకిరణం.
  Insomniacs are always in search of a dream.-Deccan Chronicle

* రహస్యం అనేది ఏకాంతంలో ఒకడికి చెప్పినదే. A secret is something told to one person at a time. -Deccan Chronicle

* Self-interest speaks all sorts of tongues, and plays all sorts of roles. -Due de la Rochefoucauld

### వదంతి,పుకార్లు hearsay, rumour

* వదంతి నగ్నసత్యం/నిక్కం కాజాలదు. Hearsay cannot be gospel truth.

* పుకార్లు పురుషసృష్టి. Rumours are person-made.

* వదంతి ఎల్లప్పుడు తప్పుకాకపోవచ్చు. Rumour is not always wrong.-Tacitus

### వార్ధక్యం senility, old age

* Old age - senility

  Unwanted baggage in the family - shunned and neglected by the family, he/she becomes a psychiatric doll.

  All the world is a stage - last age/scene of all is second childhood and mere oblivion : Sans eyes, sans ears, sans teeth, sans taste, sans everything. William Shakespeare planned these lines based on grim reality. "The children feed us without any love and affection; ofcourse, that they show on their children". -from Lifco Dictionary

* Old are not considered any more useful. -Anon

* Help Age India slogan 'Give the aged a home in your heart.'

* రెండవ బాల్యమే సుమ్ము ముదిమి -తిరుపతి వేంకటకవులు
  Old age is second childhood.

* ప్రతిమనిషి నిండు నూరేళ్ళు బ్రతకాలని కోరుకుంటాడు. కాని ముసలితాన్ని మాత్రం ఏ వ్యక్తి కోరుకోడు. -Jonathan Swift, - భావన

* వయస్సు మీద పడుతున్న కొద్దీ జీవితసౌఖ్యం తగ్గిపోతుంది. -Goldsmith,-భావన

* వయసు పెరిగినంత మాత్రాన పెద్దతనం రాదు. ముసలితనం వస్తుంది. -Johnson

* Senility - Dr. O.A. Sarma, *Medical Dictionary, p 599*

## విజ్ఞానదీపికలు, rubies of wisdom

* గుమ్మడికాయల దొంగ ఎవరంటే బుజాలు తడిమి చూసుకున్నాడట.
The guilty think all talk is of themselves. -Chaucer

* It is only too easy to compel a sensitive human being to feel guilty about anything. -Morton Irving Seiden

* అభివృద్ధి ఉన్నప్పుడు మార్పులు తప్పవు/సహజం. అయితే మార్పుకి భయపడితే అభివృద్ధి ఎలా జరుగుతుంది?
When there is growth, changes are automatic/inevitable. If I fear change, how can there be growth?

* ఒక్కొక్కసారి చిరునవ్వు ఎడారిలో వానచినుకు వలె పనిచేస్తుంది.
Sometimes a smile can be like a drop of water in a desert.

* నిరాడంబరత్వం లేకుండా అందరి ప్రేమని పొందలేము.
Without simplicity, one cannot gain TRUE affection of all.

* It is not the size of the dog in the fight, it is the size of the fight in the dog, that matters. - Roosevelt

* దుష్ప్రవర్తనను సత్ప్రవర్తనతో సరిదిద్దడమే అన్నివిధాల శ్రేయస్కరం.
-J.Foster, -సూక్తులు-హితోక్తులు. 2

* దుర్జనులు తమ లోపాలను సమర్థించుకుంటారు, సజ్జనులు విసర్జిస్తారు. -పురాణసూక్తి
Wise admit their mistakes, fools defend them.

* హక్కుకు పునాది కార్యనిర్వహణ. మనధర్మం మనం నెరవేరుస్తే హక్కులు మనపాలవుతాయి.
The true source of 'right' is duty. If we all discharge our duties, rights will not be far to seek. - Mahatma Gandhi

* ఇతరుల బలహీనతలను నా మనస్సులో ఉంచుకుంటే అవి త్వరలో నా బలహీనము కూడా అయిపోతాయి. If I keep the weaknesses of others in my mind, they soon become a part of me. - Brahma kumaris

* ఇతరుల కార్యకలాపాల గురించి పట్టించుకొనే దురభ్యాసం ఉన్నట్లయితే అది నీ పనులను పాడుచేస్తుంది. If you have the habit of minding other people's business, your own business will become bankrupt.-Brahma kumaris

* నొక్కి వక్కాణించు కాని కలహకారకుడు కావద్దు. Be assertive, not aggressive.

* శ్రద్ధలేనివాడు శుద్ధ శూన్యుడు సుమా! A person sans *'shraddha'* seldom succeeds.

* I don't wait for moods. You accomplish nothing if you do that. -Pearl Buck

* For the man sound in body and serene in mind there is no such thing as bad weather! Every sky has its beauty and storms which whip the blood but do make it pulse more vigorously. -George Gissing

* Make wisdom your provision for the journey from youth to old age, for it is more certain support than all other possessions. -Bias

* It is salutary to train oneself to be no more affected by censure than by praise. -W. Somerset Maugham

* Success in almost any field depends more on energy and drive than it does on intelligence. This explains why we have so many stupid leaders. -Sloan Wilson

* It is good to have an end to journey toward, but it is the journey that matters in the end. -Ursula K Le Guin

* History is the version of past events that people have decided to agree upon. -Napoleon

* Hereditary nobility is due to the presumption that we shall do well because our fathers have done well. -Joseph Joubert

* There is one great society alone on earth; the noble living and the noble dead. -William Wordsworth

* ఆడినమాట, వేసినబాణం, గడచిన కాలం, చేజారిన అవకాశం- ఇవి తిరిగి రావు. Four things come not back: the spoken word; the sped arrow; time past; the neglected opportunity.

* ప్రతి వస్తువుకు నిర్ణీతస్థానం ఉంటుంది, దాన్ని అక్కడే ఉంచాలి. Have a place for everything and keep the thing in that place.

* గతించిన కాల సింహావలోకనం ఉల్లాసభరితం. Think only of the past as its remembrance gives you pleasure. -Jane Austin

* Reason and calm judgement, the qualities belonging to a leader. -Tacitus

* విద్య: చిన్నవారికి సొగసు, వయోజనులకు కాలయాపన, బీదలకు భోగం, ధనవంతులకు ఆభరణం. Education is a controlling grace to the young, consolation to the old, wealth to the poor and ornament to the rich. -Diogenes Laertius

* అంతరాత్మ యొక్క శాసనం కన్నా మించినది ఏముంది? Where is there any law so clear to each man as that written in his heart? -Leo Tolstoy

* జీవితమంటే బాగోగుల కలయిక. Life is neither a good nor an evil; it is simply the place where good and evil exist. -Seneca

* It is true that liberty is precious - so precious that it must be rationed. -Nikolai Lenin

* గురువు గురుత్వాన్ని నిలబెట్టుకోవాలంటే సదా/ఎల్లప్పుడు జ్ఞానార్థిగా ఉండాలి- సదా విద్యార్థిగా సంచరించక పోయినట్లయితే మంచి టీచర్ కాజాలడు.

## Message to Teachers

A teacher to be effective should always be a learner - if he ceases to be a student, he ceases to be a good teacher. -Dr. S. Radhakrishnan

* ప్రకార్లు/వదంతులు ఉదారబుద్ధి కలిగియుండవు.
Rumours will rarely be broad-minded.

* SCHOOL :
S stands for sincerity (మనఃపూర్వక సద్భావము)
C stands for capacity (దక్షత)
H stands for honesty (నిజాయతి)
O stands for obedience (వినయ విధేయత)
O stands for orderliness (క్రమ రీతి)
L stands for learning (చదువు) -TK Yasodha as quoted in Lifco Dictionary

* స్కూల్లో గురువు తల్లి/తండ్రితో సమానము; ఇంట్లో తల్లి/తండ్రి గురువుతో సమానము.
In school, the teacher is the parent; at home, the parent is the teacher. -Delhi Public School

* ధర్మశీలత/ఋజుప్రవర్తన జాతి ఔన్నత్యం.
Righteousness exalteth a nation. - Old Testament

* వివేక వేత్తలు తప్పులను ఒప్పుకుంటారు, మూర్ఖులు సమర్థించుకుంటారు.
Wise men admit their mistakes; fools defend them.

* ప్రజలే వార్తావాహిని. News is people.

* గింజ పట్టిన కంకి ఒంగునట్లు జ్ఞానము కలిగిన వ్యక్తి నమ్రత కలిగిఉంటాడు.
–స్వామి సుందరచైతన్యానంద

* జ్ఞానం వలన అహంకారం పోతుంది, భక్తి వలన మమకారం నశిస్తుంది. –అవధూత స్వామి

* చీకటనే వస్తువే లేదు. జ్ఞానమనే దీపం లేకపోవుటే చీకటి. –మళయాళ స్వామి

* పరుగెత్తి పాలు త్రాగే కన్నా నిలుచుని నీళ్ళు తాగడం మేలు.
"Wait & watch" attitude preferable to "run & lose" attitude.

## విద్య education

* నెరవాది నిర్వచనం : విద్య : మీ సంతానానికి ప్రాపు (prop).
Deft definition : Education : a gift to ensure his future, for your child.

* విద్య అంటే వినయం. Education is character.

* విద్య నిగూఢ గుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్యగురుండు విదేశబంధుడున్
విద్య విశిష్ట దైవతము విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము విద్య నెరుంగనివాడు మర్త్యుడే. -భర్తృహరి

* విద్య యొసగును వినయంబు వినయమునను బడయు పాత్రత పాత్రత వలన ధనము
ధనము వలనను ధర్మంబు దానివలన నైహికాముష్మిక సుఖంబులందు నరుడు.
-చిన్నయసూరి

* విద్య అనే ఈ సముద్రాన్ని తరచిన కొలదీ దీని వైశాల్యం మరీ మరీ ఎక్కువ అవుతుంది. -భావన

* సన్నుతంబగు విద్య చాలు నొక్కటియె. -గౌరన, -భావన

* Education is what survives after you have forgotten what you memorized. Education is what lasts after you have forgotten what you learned. -Graffiti, Deccan Chronicle

* విద్య విషయాలు తెలుసుకొనడానికే గాదు, నీతిగా బ్రతకటానికి.
Education is not only learning but character-building.

## విధి fate

* కాలం కలిసొస్తె విధి వింజామరలు వీస్తుంది.
We make our fortunes and we call them fate. -Disraeli

* విధి బలీయం. Fate is odd. Fate is forceful.

* విధి యొక్క హస్తాలతో కన్నీరు తుడవటం. Wiping tears with Fate's hands.

## వివాహం marriage, wedlock

* వివాహం: రెండు వివిధ శక్తుల సమ్మేళనం.
Marriage : an attempt at a peaceful coexistence of two different nervous systems.

* పెండ్లయిన జంటలు వివాహబంధంలో చిక్కుకున్నారు.
Married couples are wedlocked- Fevicol-fast attachment.

* నీవు ప్రేమించిన వారిని వివాహం చేసుకోకు. నిన్ను ప్రేమించిన వారిని వివాహం చేసుకో.

* సుఖంగా పెళ్ళిచేసుకో, పెళ్ళాం అనుకూలవతి అయిందా సుఖపడగలవు; కాదూ! వేదాంతివి అవుతావు.

* మెచ్చి మేనరికరంబు ఇచ్చేటి కంటె-మెడకోసి నూతిలో వేసితే మేలు-లేకుంటె గంగలో కలిపితే మేలు. -ప్రయాగ నరసింహశాస్త్రి సంకలితము -Voice against consanguinity

* వివాహం చేసుకోవడం కర్తవ్యం. అయితే రెండవ పెండ్లి చేసుకుంటే మాత్రం అది లాలసత. మూడో పెండ్లి అయితే ఉన్మాదం. -సామెత,-భావన

## వివేకి sensible person

* చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు.
It is easy to be wise after the event. -English proverb

* వివేకి విలువ అమూల్యం. The price of wisdom is above rubies.-JOB

* వివేకి జీవితంలో పండినవాడు. Wisdom is the gray hair unto men,... -Wisdom of Solomon

* వివేకి అయినవాడు మితభాషిగా ఉండాలి/ఉంటాడు.
A wise man is known for the things he does not say.

## విశ్వం universe

* ప్రపంచం భగవంతుని సొత్తు. The world is God's world, after all. - Kingsley

* ప్రపంచం జీవితచదరంగం, ప్రజలు పావులు.
All the world's a stage, and all the men and women merely players. - Shakespeare, *As You Like It*

* సర్వం ఖల్విదమ్ బ్రహ్మ. ఈ విశ్వమంతయు బ్రహ్మస్వరూపమే.

## వృద్ధి prosperity

* వృద్ధి, అభివృద్ధి. Prosperity, plenty

* సిరి కలిగితే కొందరు హర్షిస్తారు కాని పెక్కుమంది ఈర్ష్యతో శత్రువులవుతారు.
Prosperity makes some friends and many enemies. -Vauvenargues

* 1. Health Statistics 2. G D P Gross domestic product.
  - indices of the prosperity of a Nation

## వైరాగ్యం renunciation

* వైరాగ్యం శృతి మించితే విరాగం అవుతుంది జాగ్రత్త!
* విరక్తుడు ఒక్క మాటలో అధైర్యపరచగలడు. - Emerson. -భావన
* కొండగుహల్లో, కారడవుల్లో వున్నంత మాత్రాన, కాషాయ వస్త్రాలు ధరించిన మాత్రాన ఆశాపాశబద్ధుడు యోగి కాలేడు. -శంకరాచార్య
* భోగములు గల్గినచో యోగంబు లేదు. యోగము కల్గిన చోటను భోగంబులు లేవు. -వెన్నెలకంటి సూరన

## వ్యసనాలు addictions, e.g. drinking, drugs

* సారాయి త్రాగుట సభకు యోగ్యతకాదు. -వేమన
* జూదమూ, వాదమూ వేదనను కల్గిస్తాయి. -అవ్వైయ్యార్

## వ్యాకులము melancholy

* వ్యాకుల చిత్తం మేకుల కుర్చీ.
* వ్యాకులము : దుఃఖకర ఘట్టము గురించి సంతసించుట.
  Melancholy: feeling good about being sad.

## వ్యాధులు, వైద్యం diseases, treatment

* చికిత్సకుడు కేవలం చికిత్స చేస్తాడు. ప్రకృతి పూర్తిగా బాగుచేస్తుంది. - Aristotle
* మందిచ్చేది నేను, నయం చేసేది భగవంతుడే.
  'I treat, He cures'. "I dressed him, God cured him".-Ambroise Pare
* బలహీనత అనే వ్యాధికి చికిత్స లేదు. Old age itself is an incurable disease.
* భోగలాలసతే ఒక నిజమైన వ్యాధి. "దుఃఖము, బాధ" దానికి సరిఅయిన చికిత్స. -గాంధీజీ, -భావన

## వ్యాయామం exercise

* వ్యాయామం స్వస్థతకు సోపానం. Think exercise as the essence of well-being.

* వ్యాయామం పేశీలకు కీళ్ళకు పోషకాహారం, జీవనాధారం.
Exercise is like food to muscles and joints.

* నీ గుండె కాయను వ్యాయామంతో మాలిమి చేసుకొనగలవు.
You can tame your heart with exercise.

* వ్యాయామం కాయానికి పోషణ. Exercise is food for the body.

* వ్యాయామం గుండెకు పోషణ. Exercise is food for the heart.

* శరీరానికి వ్యాయామం, మనస్సుకు వివేకం/ ఉల్లాసం– ఈ రెండూ అవసరమే.
Essential prerequisites in life : Exercise for the body, enlightenment for the psyche/mind.

* వ్యాయామం సమత్వాన్ని, సమానాధికారాన్ని, పటుత్వాన్ని మరియు 'లతను పోలిన నేవళాన్ని' పెంపొందింపజేసి, దినచర్యలో పాట్లను నివారిస్తుంది.
Exercise improves one's balance, coordination, strength and flexibility which are important in avoiding falls/injuries.

## శత్రువు enemy

* మనిషే మనిషికి దుర్భర శత్రువు. Man is his own worst enemy.-Cicero

* నీకు నీకంటె పెద్ద శత్రువు లేదు.
None but yourself who are your greatest foe. -Longfellow
(పొడుగాటి ఆయన)

* నీవు నీ యొక్క శత్రువు కొరకు రగిల్చిన మంటలు మూడు వంతులు నిన్నే కాల్చేస్తాయి.
-చైనా సామెత, -భావన

* మనోవికారములే నిజమైన శత్రువులని గ్రహించి వానితో నిత్యమూ పోరాటము సలుపవలయును.
-గాంధీజీ, -భావన

## శరీరం body

* నీ శరీరమే నీ ప్రాణానికి నివాసం. Body is one's abode.

* ఆరోగ్యమైన శరీరం ఆత్మకు విడిది; అనారోగ్య శరీరం కారాగారం.
A healthy body is a guest - chamber for the soul; a sick body is a prison. - Bacon, *The Advancement of Learning*

* ఈ శరీరం విస్తరి వంటిది. భోజనానంతరం విస్తరిని జాగ్రత్త చేసుకుంటామా! శరీరమూ అంతే. -శ్రీ రమణ మహర్షి

* శ్లో॥ శరీరే జర్ఝరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే
ఔషధీ జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః

## శాంతి peace

* పోరు మంచి కాదు భూమి నెక్కడను. - శ్రీనాథుడు

* దాంతునకైన వేదాంతునకైన శాంతములేక సౌఖ్యములేదు. - త్యాగరాజు

* శాంతి అంటే ఏమిటి? రెండు యుద్ధాల మధ్య వ్యవధి. -Bernard Shaw

* అందరూ యోధులే జీవిత సమరంలో-
కొందరు అగ్రసరులు కొందరు అనుచరులు. - భావన

* శాంతి కావాలనుకుంటే, ప్రభుత్వాలు గుండుసూదులు గుచ్చబడే సమయంలోనే మేలుకుంటే (చర్యతీసుకుంటే) తర్వాత తుపాకి తూట్లు తప్పించవచ్చు. If they want peace, nations should avoid the pin-pricks that precede cannon -shots. - Napoleon
ఇది ప్రభుత్వాలకే గాదు ఇళ్ళల్లో కూడా వర్తిస్తుంది.

* మంచితనం మరియు శాంతి తోటి ముచ్చట్లు.
Righteousness and peace have kissed each other. - Psalms

* యుద్ధసన్నాహమే శాంతి నెలకొల్పడానికి నాంది (గమనించండి యుద్ధం చేయడం అనలేదు). To be prepared for war is one of the most effectual means of preserving peace. -Washington

* ఓం శాంతిః శాంతిః శాంతిః Peace be unto you.

## శాస్త్రం science

* కళ నేను; శాస్త్రం మనం. Art is I; science is we. - Claude Bernard

* శాస్త్రం క్రోడీకరించిన జ్ఞానం.
Science is organised knowledge. -Spencer, *Education*

